

శ్రీమద్గురు పరబ్రహ్మణేనమః



జవ్వాదుల లింగాయోగి దేశిక

# శ్రీ రాజయోగాంతర ప్రబోధిని



శా॥ శ్రీరాముప్రభు దాసినై జనకజా సేవ్యుండనా నొప్పి సం
సారాప్రాకృత దోషముల్ విడచి వాంఛన్ నిర్మలబ్రహ్మత
త్త్వారాంబాప్పగ మద్గురుండు శ్రీలింగయ్యాఖ్యుహృత్కంజమా
దారూఢిన్ పరమైఖ్య భావసంధానంబు ప్రార్థించెదన్॥

సీ॥ శ్రీమించు శృతగిరి సీమలో శావల్యబురియందు వెలసిరి పొందికలర
నాగ్రామమందున నసవ్రతపూజాభినిధ జవ్వాదులవంశవర్ధతబుధుండు
స్థిరతగురవయ్యార్య గరితలక్ష్మాంబనషద్పుత్రిలనుగనిరిసంతతమున
ప్రథమసుతులింగయ్య పరిపూర్ణుడై సదాగురుస్థానమునునిల్పె కోరికల
అద్వితీయుండు వెంకటరామార్య ఘనుడు తృతీయ చతురులు
సుబ్బయ్య చంద్రిలనవి । భ్రాతి రామయ్యనఘు పేరార్య బరగు
చుండు । ధన్యులై వెలసె వంశాబ్ధి ధరజెలంగ॥

సీ॥ఆవంశాబ్ధిచంద్రినలఘుదయామయుడుపరిపూర్ణబ్రహ్మసంస్థానవిదుడు
నగుగురులింగయార్యాయోగిఘనుండుసుజనకటాక్షబోధితపదుండు
గనిభక్తియుక్తిచేకారణాచార్యులు మాతల్లిదండ్రియుమహితవరులు
బ్రీతితో శ్రీచెవ్వుల కోటార్యధీరుండు తనపత్నియచ్చమాంబనగనెగడు
వీరలకునొక్కపుత్రుడనవెలసినాడ। శూక్తిగురులింగపాదాభిషేకయు
తుడనై జపించెదపుల్లదాసార్థి జనుడ। స్థిరతకూచనపల్లిలోపరగువాడ॥

శ్లో॥ ఉరసా శిరసాదృష్ట్యాః మనసా వచసాధనః
దాపఫ్యాంకరాభ్యాం కర్ణభ్యాం! ప్రణామోష్టాంగఉత్యతేః॥
అను పెద్దలవేడ వాక్యాచరణుడనై వారిని భజియించి

తప్పొప్పుల నెఱుగక.

శ్లో॥ మయ్యేవం సకలసంజాతం మైసర్వం ప్రతిష్టతం
మైసర్వం లయంయాతి తద్బ్రహ్మంద్వయమస్మహం॥

అను సద్గురువాక్యమువలన మరిన్ని.

శ్లో॥ శిష్యపాపం గురుక్వేత్తు॥ అను విషయమువలన విస్తరించి తెలియ
యే వ్రాసియున్నాడ నిందు దోషములున్న నిషేధించుటకున్ను
నెరసులు సవరించుటకున్ను ప్రార్థించుచున్నాడ.

శ్లో॥ భావాద్వైతము క్రియాద్వైతము ద్రవ్యాద్వైతం తదైవచః
అద్వైతం త్రివిధంప్రాహు ర్నాద్వైతం గురుసన్నిధౌ॥

సీ॥ అఖిలభూతముల కనాదియా బ్రహ్మంబు మద్గురుసాన్నిధ్య మమరి
యుండు। అఖిలప్రపంచమ్ము కందనిబ్రహ్మంబు మద్గురుసాన్నిధ్య
మమరియుండు। అఖిలగురుజనముల వైకల్యబ్రహ్మంబు మద్గురుసా
న్నిధ్యమమరియుండు। అఖిలవెల్గులమించు అబ్రహ్మనైక్యంబు। మ
ద్గురుసాన్నిధ్యమమరియుండుఅఖిలసగుణనిర్గుణసచ్చిదానంద మొందు
అఖిలనిగమాంతశాస్త్రంబు లాదినిండు। అఖిలఅహం బ్రహ్మంబు
నాత్మనుండు। అచలగురులింగయోగినామదిననుండు॥

తే॥ సూత్రము మహనాట్వి సభయు। గోత్రముపసుపునూళ్ళశ్రేష్టికోరి
కవినుమా। బాత్రతగురుసంస్థానము। నేత్రోత్సవమిచ్చెశిష్య జనా
వళికెల్లక॥

ఆర్యగురువర్యుల కభిముఖుడనై వందనము లర్పించుచున్నాడను.

—:0:—

ఆర్యులారా! పాఠకమహాశయులార!

మానవులకు ముఖ్యముగా కావలసినదెద్దియోమనవిజేసు కొనెద—ఒకానొకసమయమున వసిష్ట, వాల్మీక, శుక, శౌనక, భీష్మ, రుక్మాంగద, ప్రహ్లాద, విభీషణ, గౌతమ, గార్గేయ, కపిల, గంధర్వ, అర్జున, ముచుకుంద, యుద్ధవా, అక్రూర, మైత్రేయ, సనకసనందన, సనత్కుమార, సనసుజాతాది పరమభాగవతోత్తములు విజనప్రదేశము న సంఘముగాగూడిరి అంతవారలలో నొకరు నవవిధభక్తులలో శ్రేష్ట మగు భక్తియేదియని ప్రశ్న జేసిరి. అంతనొకరు స్మరణయనిరి నొకరు పాదసేవనమనిరి. మరియొకరు అర్చనమనిరి. యింకనొకరు వందనమనిరి అటుపైనొకరు దాస్యమనిరి ఆవెనుకనొకరు సఖ్యమనిరి. మరలనొకరు ఆత్మనివేదనమనిరి అందరుఅన్నివిధములుగా జెప్పిరిగాని సందేహము దీరదయ్యె: అంతవసిష్టమహాఋషి యేకాంతభక్తియని రూఢిపర్చె అంతనందరును సంతోషించిరి గనుక మానవునకు ముఖ్యముగా కావలసినది యేకాంతభక్తియే. యీభక్తియే విదేహ కైవల్యమును నిచ్చును.

ఇట్లు విధేయుడు.

జవ్వాదుల లింగాయోగి,

వినుకొండతాలూకా

శాల్యాపురం గ్రామము.

## కల్యాణి — రూపకము.

భజనపరులకెల్ల శరణు ప్రస్తుతించెదను శ్రీహరి ॥ భజన ॥
గజములంటి శ్రమలనొంది భజము హయమెునర్చి నొందుద్విజము నివర్యులనెల్లను భజియించెద హర్నిశమును సుజనులపాదాద్వయముల కిదె జేయుము వందనములు ॥ భజన ॥
సారము లేనట్టి యీ సంసారవనధి దాటతరమా నేరుపుగల్గిన పండితార్యవరుల జేరితనివి దీరగ ప్రార్థించెద ఇంపారెడు భవబాధము నెడ జేరగ వెల్గెడు పెద్దలకారాధ్యము జేయువాడ ॥ భజన ॥
ఈషణత్రయములు భ్రమయు నెంటనంటిన ప్రవ్యసన భాసమైన దశ ఇంద్రియనవేశములకు తాళ్ళజాలక గాసిల్లుచు వెతలనుంటి కరుణ యునను బ్రోవుమంటి నీసద్బ్రహ్మలింగాయోగీంద్రులశరణయంటి॥భ
నిత్యమునొనర్చు ఘోరకృత్యముల నెంచకమము సచ్చరిత్రులైన మహాదిత్యులార దయనుగనుడీ వ్యత్యయసంసారాబ్ధినబడి ద్రిచ్చియునే మరకనుంటి నచ్చెరువుగ చెవుల పుల్లాదాసాఖ్యుడ వేడుచుంటి ॥భజన॥

## సారంగరాగము — తిశ్రజాతి లఘువు

ముందుగా మీా యావన్మందికి వందనములిడెదనయ్యా । సంద ర్భము లేక యీా మందమతుల మన్నించుడీ సందేహము లేదు యింద తప్పులెన్నోగలవు తెలియ ॥ ముందుగా ॥
పరమ యోగులకు వందనము వరమునులకు ప్రణతులును ధర కవులకు సాష్టాంగము మరిబుధులకు దణ్ణములివే ॥ ముం ॥
దేశికాజ్ఞవలననిట్లు జేసిబాడుకొండమని ఆశగల్గివ్రాశితిని వాసి ప్రజ్ఞగాదుచూడదోషములనుదిద్దుటకునాశ్రయించితిముందుగాను॥ముం
ధరణుప్రొద్దుజర్లశ్రీయగ్రం శెట్టిపుల్లాదాసావరదమహాన్భావులకు వందనములర్పించెద శరణంటిని లింగగురునివలెనె బ్రోవుడయ్యా॥ముం॥

— —

ఓం. శ్రీసద్గురుపరబ్రహ్మణేనమః

## ఆనంద భైరవి ఏకతాళము

గురునితో సరిదైవము। యీధరణియందున లేదుగా॥ యీధరణియందున లేదుగా। సద్గురుడునరుడసరాదుగా॥ గురుని॥

1 దేహమన తెరదీసివేసి దేహినీజూపించెగా। సోహమనే ఖడ్గమునా॥ మోహమును దెగవేసెగా॥ గురుని॥

2 ఆరుచక్రములందు దిరిగే। హంసలనుజూపించెగా॥ హంసఇరువది యొక్క వెయ్యి ఆర్నూరెక్కించెగా। ॥గురు॥

3 అక్షరబ్రహ్మంబు రెండ। శక్తులంమనజూపెగా। శక్తులాగ్రహమందునరా। సాక్షినీజూపించెగా। ॥గురు॥

4 మొండమూవులయంటి యీబ్రహ్మాండ బాండముజూపెగా। మండలత్రయమధ్యమందున కుండలేంద్రుని జూపెగా ॥గురు॥

5 సాదనాచేతృష్టయముల। సరణినీ విరచించెగా। రాజయోగులధర్మమిదియని। బాధలన్నియుదీర్చెగా ॥గురు॥

6 నిష్టతోనుద్వాదశాక్షరి। గట్టిగాపఠియించెగా బట్టబయలందూన ఎరుక। పుట్టలేదనిచెప్పెగా ॥గురు॥

7 కల్లజగమవిలింగయార్యులు। యుల్లమందున దెల్పెగా మల్లిచూడకు పంచదశియనే। మర్మమునుబోధించెగా ॥గురు॥

8 యుల్లమలరగదుగ్గిరాల। యల్లయార్యుడుదెలిసెగా। మల్లెమొల్లల విరులుదెచ్చికొల్లగా పూజింతుగా ॥గురు॥

## 2 వ. వచనము — నీలాంబరి — ఏకతాళం.

1 మనసునిల్వకున్నదెందుకూ ॥ప్రశ్న॥ జన్మఖర్మమనుభవించెటందుకూ। అనుదినమార్యులజనులతో జతగూడి। అనుభవజ్ఞానాము అనుభవించనివారి మనసునిల్వకున్నదందుకూ॥

2 ప్రశ్న॥ బుద్ధినిల్వదెందుకూ?—
ఉత్తరవు॥ ఖర్మబద్ధులై చెడిపోయెటందుకూ, హద్దుమీరక గురునివద్దనిలచుండి వారిపద్ధతి నెరుగనివ్యర్థులైనవారిబుద్ధినిల్వకున్నదదుంకూ

3 ప్ర॥ పెద్దల నిందించెదెందుకు?—

ఉ॥ పెద్దయెద్దులైజన్మించేటందుకూ. సద్దివేడిదిని మొద్దులవలెవ్వారి బద్ధులైయమునికి వ్యర్థులయ్యేవారు పెద్దలనిందించెదందుకూ.

4 ప్ర॥ తల్లిదండ్రులగొట్టెదెందుకన్నా?—

ఉ॥ ముందుదరిజేరెగతిగానసందుకూ పెద్దలమాటలపెడచెవులవిం టూమగద్దరీపీడాని యముమమొద్దుపీటిల మొట్టెటందుకూ.

5 ప్ర॥ కండలూబహుపెంచెదెందుకూ?—

ఉ॥ వల్లకాటిలోగలగాల్చేటందుకూచెదరినకట్టెలు మరి మరి మెగ దోఁచి కుదురుగదలగాల్చేటందుకూ.

6 ప్ర॥ ఆలుపిల్లలబ్రమతలెందుకూ?—

ఉ॥ కాలదూతలచేనలిగెటుందుకూ ఫాలభాగమునందువాలనాడు చునున్న వరలింగగురుజేరనందుకూ.

7 ప్ర॥ గురునిసేవజేయుటెందుకూ?—

ఉ॥ జన్మకడతేఘటకు మూలమందుకూమరుగెరిగి పుగ్గిరాలనాగ మాంబదేవిమరలజన్మముజెంద నందుకూ.

3 వ. తత్వము—నాదనామక్రియ—యేకతాళం

మానవులారరండీ! గురువరుమర్మంబెరిగనుగొండీ! మానకసద్గు రు మర్మముగనుగొన! జ్ఞానులై తెలజ్ఞానము నొందక॥మాన॥ ఆరుమూడు విడువండి!ఆవలఅనుభవమునుగనుగొండీ! ఆరుమూడుతుదఆవలవెలిగె టి॥ ధామునిగనుగొనభానుబిదియే॥మాన॥ అండపిండములమీరి! బ్ర హ్మాండభాండమునజేరి!కుండలినమునుదండిగనుండెటి!దండిజ్యోతిహరిద రిశనమిచ్చును॥మాన॥ ఇలనుశుక్లశోణితముగూడిన! తనువాకారమునిజ ముయిరువుజేసుకొనిమరలయోనులను! ధరణుగల్గిరండరిలాగున॥మాన॥ కాయమస్థిరముగాదు! మనసూపాప్రియమునిల్వబోదు! వాయువులనగి తేకాయములయమా! వాయునగలిసేయుపాయముదెలుసును॥మాన॥ ధరణిలోశావల్యాపురమునివాసులింగగురుజేరి! చలముగానెలచలమును గనుంగొని! కలగాసర్వముగాంచుటకొరకై॥మాన॥ ఆశపాశములుగో! సి! కుప్పమకోటమాంబమదిరోసి మోసములేనిబ్రహ్మావుపదేశముగని దోసిలొగ్గిపరదేశముగనుటకు॥మాన॥

### 4 వ. తత్వము—ఆనంద భైరవి ఆటతాళం

1 పల్లవి॥ యెందుకూయీ జన్మమెత్తుట హేతు వేమీగురువరా॥ మందబుద్ధినిదీసివేసి నురుగుదెల్పుము గురువరా॥ఎందు॥

2 పంచభూతోత్పత్తియెట్టిదిపాదుదెల్పుముగురువరా॥ సంచితంబులు దుంచివేసె సరణిదెల్పుము గురువరా॥ఎందు॥

3 తారకమంత్రంబుజెప్పి దరికిజేర్పుముగురువరా॥ తరముగనేబ్రహ్మ పదముకు దారిజూపుముగురువరా॥ఎందు॥

4 కామములకడద్రొక్కివేసేక్రమము దెల్పుముగురువరా॥ సామజంబులదుంచివేసేసరణిదెల్పుముగురువరా॥ఎందు॥

5 కాటుకపక్షులవెంటినూటిదెల్పుముగురువరా॥ కోటలన్నీ దాటుటాకుబాటదెల్పుముగురువరా॥ఎందు॥

6 ఇడపింగళనాడులందున వివరమేమిటిగురువరా॥ కూడికుంబకమందునిలిపేకుదిరికెట్టిదిగురువరా॥ఎందు॥

7 వసుధలోశావల్యాపురమువాసుజూపుముగురువరా॥ మనమునందు నలింగగురునిమరువజాలనుగురువరా॥ఎందు॥

బోటిఉడుపులలింగమూంబకుసూటిదెల్పుముగురువరా॥మాటలేటికిజన్మ రహితము మార్గమెట్టిదిగురువరా॥ ఎందుకూయీజన్మమెత్తుటహేతువే మిటిగురువరా॥ఎందు॥

### 5 వ. తత్వము—త్రిజాతి యేకతాళం

నాకేమిభయమింకనమ్మియున్నాను। తనువుప్రాణము గురునకుదక్షిణిచ్చాను ॥నా॥

ఒక్కక్షరములోనవైపుగన్నాను। రెండక్షరములచే సోహమైనాను॥నా॥ మూడక్షరములలోముక్తిగన్నాను। నాలుగక్షరముల నమరియున్నాను॥నా॥ పంచాక్షరములలోపద్మాశిన్నాను। ఆరక్షరములచేప్రణమామైనాను॥నా॥ సప్తక్షరములలో! సరణివిన్నాను। యెనిమిదక్షరముల ఏకమైనాను ॥నా॥ తొమ్మిదక్షరములదోవగన్నాను పదియక్షరములాను పదిలాపరచాను॥ పండ్రెండక్షరములా। పాదుగొన్నానుపదియూరక్షరములబయులుపడ్డాను॥ ధరణిలోశావల్యపురముగన్నాను మదినలింగగురునిమరువకున్నాను॥నా

నాశనవీరాంబనమ్మి యున్నాను భావరహితమైన బయలుగన్నాను॥ నాకేమిభయమింక నమ్మియున్నాను తనువు ప్రాణముగురునకు దక్షణిచ్చాను ॥నా॥

## మంగళహారతి.

ధరణిలో అన్నవరపు పురమందువిలసిల్లి! వెలిసీడిలక్ష్మయ్యగర్భమందునబుట్టి। డాసరీ సోడయ్య కోడలీవైబూవి వాసికెక్కిన వరలక్ష్మి నీకమ్మ ॥ మంగళం మంగళం సద్గురు జయా ॥ మంగళం

పతియైనా సోమయ్యపద్ధతి నెరిగీయు అతులితమతివయ్యఆనందముతో। అర్గురుపుత్రులు వరకనట్టియు । నీవైభవమేమని వర్ణింతుమెఓతల్లీ ॥మంగళం॥

అత్త మామలఆజ్ఞహద్దుదప్పకనిలచి ఆడినమాటెనురాడకనూ। ఆడబిడ్డలతోనుఆనందముగమనసు పూనివర్తించినపుణ్యాత్మ నీకమ్మా ॥మంగళం॥

మనమలు మనమసంతానము నీకమ్మ। నీసంతతియేమనివర్ణింతుమమ్మా। పెద్దలందరుగూడి పేర్మితోడుత। నీవద్దనిల్చిరి వైభవముజూడవెతల్లీ ॥మంగళం॥

ధరణిలో శావల్యపురమందు విలసిల్లి లింగగురుని సేవపొంగిచేసీ। రామతారకమంత్ర రహస్యము తెలసీయు। పరంపదమేంచేసి పద్మాక్షి రోనీకు ॥మంగళం॥

నమ్మినపుత్రుడు నరసింహదాసుడ సమ్మతించియునీసేవా జేసీమెప్పుడుయమ్మనియరవక కొలచితే। వరములిచ్చిపరము జెందినఓతల్లీ ॥మం॥

వసుధలో పొన్నూరు పురమందు నిలచుండి। దాసరమాలక్ష్మమ్మ దయజూడవే। ధనధాన్యసంపదలు తరుగు లేకనుయిచ్చి। కలసివర్తిల్లవె కల్యాణగుణధామ॥మంగళంమంగళం సద్గురుజయా మంగళంమంగళం ॥

వాల్మీకొంసోద్భవుడు । బాలాదాసు। దాసానదాసుడై ధరణియందు । ఆసించుకొని పెద్దల తీర్థప్రసాదముకు దోసిలొగ్గితినన్ను తాశిరక్షించవే ॥ మంగళం మంగళం సద్గురు జయామంగళం మంగళం ॥

———



శ్రీరస్తు

శ్రీమద్గురు పరబ్రహ్మణేనమః

జివ్వాదుల లింగా యోగి దేశిక

# శ్రీ రాజయోగాంతర ప్రబోధిని



విఘ్నేశ్వర ప్రార్థన.

గీ॥ ముందుగా ఆధారచక్రమందు। ఆరునూరల హంసపోబడిగలిగిన
గణపతో నిన్ను బ్రార్థించువాడ। నామనోభీష్టమీడేర్చుమో విఘ్నరాజ॥

శ్రీసద్గురుపరబ్రహ్మణేనమః ఏకతాళము.

౧. సరస్వతి ప్రార్థన–కీర్తన నిత్యకల్యాణిరాగం.

తల్లీ సారస్వతి నిన్నేనమ్మి ప్రార్థించుచుంటి ॥తల్లీ॥ కల్లామాటగాదు భక్తులబ్రోచుటకు పల్లవపాణి అలికులవేణి గీర్వాణిబోణి వాబ్రహ్మ రాణి ॥ తల్లి ॥ తలవాకిటగల్గు కవితామతల్లీవిగాద కలిమాయలోనా నన్నుకలియగాజేసి బ్రహ్మకులకాంత సునితాంత ముక్తికాంత పంతమా యింత ॥ తల్లి॥ వేదశాస్త్రపురాణమాది దేవతవనగ నాదాబ్రహ్మనంద సత్యవాణిగావ నీదయరాద నామీదయింతవాద యీదేటివిద ॥ తల్లి ॥ లింగగురునిడ యరగింశెట్టి పుల్లాదాస లింగనిరుగంగ జేయను నీతరమా భంగమైతి యిదివరకుమతి హీనుడనైతి కానకపోతి॥ తల్లీ ॥

గీ॥ శావల్యా పురనివాసుడైన। లింగగురుని మహిమలెన్నగతరమానె
పామరులకు కానుగుణముసేతనిందెజేసెరుగాని। జననమరణమనెడు నరకమునకు॥

౨. తత్వము. బెహాగ్ రాగము ఏకతాళము.

వందనములు గురువరా నా వందనములుగురువరా నాయం దునీదయుందానందపదవీ నొందంగా జేయుమో సుందరా ॥ వం ॥

కానకనీపదములు నేగానక నీపదములు పూనియు వెరిబట్టిన సునకామువలెను దిరిగి యోనిసంభవులగు వానినెరుగను॥ వంద॥

దోసిలొగ్గితి నిప్పుడిదయకు దోసిలొగ్గితినిప్పుడీదయకు వాగాశి దీర్చి జీవాత్మకు వాసిపదమును శాశ్వత సుఖమునొందజేయుమా॥ వం॥

తారకామనిపల్కితిరి జీసాధారణమని పల్కితిరి యాదారి తెల్పి సాంఖ్య యమనస్కభావం గురువర్యా దెల్పుమా ॥వంద॥

ప్రజ్ఞానబ్రహ్మంయని పల్కితిరి నాతో ప్రజ్ఞానబ్రహ్మంయని పల్కితిరి ఆసంజ్ఞ దెల్పి మహావాక్య సిద్ధాంతంబు సుజ్ఞానం నాకుగలుగ జేయుమీ ॥వంద॥

పూర్ణంబనిపల్కితిరి సర్వం పరిపూర్ణంబనిపల్కితిరి యెటుకా యెటులుద్భవించె మరలి యెటులయమునొందె ఆరహస్యం తెలిసిపరము లోకలియా జేయుమా ॥వ॥

పంచభూతమువలన జగముల్ జీవుల్ ॥పం॥ యొంచగా జన్మించి రువదియైను తత్వంబులను పంచీకరణము దెల్పాచార్యుడా॥ వంద॥

ఆరూ లేకేడుచక్రములంటిరి ఘటములో॥ ఆరు॥ వారుయెవ్వరెవరో ఆమరుగుస్థానంబునను చేరా బోధించక నినువిడువను॥ వంద॥

ఆరు మూడిడుమనిపల్కితిరి దృఢముతో ॥ ఆరు॥ చేరి హరి యేడు యెనిమిది మూడువాసనలనుంచేదారి జూపినీలో జేర్చుమా॥ వం

త్రివిధప్రసాదములిచ్చెదమంటిరి॥ముందుగ॥త్రి॥ షడ్విధసమాధులను సాక్షిభూతుడైన వెలుగుపదములమాటిని తెలియా జేయుమా॥వం॥

ఇంతవిచారణమనగుటకు నేనింతవిచారణ ॥ యొంతవాడ లింగ గురుడవై పుల్లాదాసకైక్యంబులిచ్చి బ్రోవానీవేకా॥ వందనంబులు॥

### 3. తత్వము—అటతాళం కాంభోజి రాగం

మధురాము రామనామ। మధురాముగోరిలేకా। మాదులను బారలుచుంటివిగదురా । జీవాత్మఅయిక్యపదవి తెలియాకపోతివిగదరా వృధాగ కాలము గడిపిహరినెరుగకుంటివి గదురా। అజ్ఞానిబోధ విషమూగ జూచి చెడితివిగదురా । విధము తెలియక యమునివశలోనజిక్కి-

జననమరణము జెందకుండెడి। మధురామృతము మరచి ॥ మధురా ॥

హరిదాసులానుజూచి మరి మరి నిందెజేయుచు । పరస్త్రీలకోరి కొదలవుగదురా । దుర్గుణముచేత పరద్రవ్యాభ్రాంతి విడువవుగదురా । మాత్సర్యగుణమున పరులక్షేమంబు కోర్వవుగదురా। పొగరెక్కితలకు బ్రతికిన్నాళ్ళి న్నెరుగవు గదురా। వారు వీరనియెంచి సారహీనతమైన శరీరామె నమ్ముకొని । మనసాయిటుచెడితివమృతా॥ మ॥

చెప్పకుమాటలను చెవిచోరనాలకించి। తప్పుడుపనులనుంటివి గదురా । యెప్పుడు రుచిగల తిండికి మురియుచునుంటివిగదురా। తప్పక యిండ్లుతిరిగి జగడాము తెస్తవుగదురా । యిప్పుడెగురుని వెదకి వైరాగ్యమందవుగదురా । చప్పిడిమాటనదలి మొండివాదాముమాని । యెప్పుడునీలో వెలుగుచుండెవా న్నెరిగి రామ॥ మధురాము॥

తనువునుజూచి మురయూచువినయమునసతిసుతులను। బాంధవులను నమ్ముకొంటివిగదురా । ఇషణత్రయంబులజిక్కిమాయనుమునుగుచుంటివి గదురా। ఘనుడౌదమని లంచగొండి మేతమేస్తివిగదురా వినయములు జూపెకపటజనులతో కూడియుంటివి గదురా। పూనియుజార చోరపనులలో రుచులజూచి మానభంగమ్మునొందె। యీరీతిమెలగుచుంటివి॥మ॥

పొట్టాకొరకై కోటిబూటకములు నేర్చి మేలైనవైద్యుడంటివిగదురా । నేనైనకోటి భూతవైద్యుడనంటివి గదురా । అటుగాక సర్వబేరంబులాడు చుంటివిగదురా కటికాదివృత్తి కోటిప్రాణముల జంపితిగదురా। హాటక వేలుడౌహరిబాటదెలియగలేక కూటికై చదువులు నేర్చి నీదోజులు గడిపితి ॥ మ ॥

కల్లుభంగి సారాయి మాదుమలాను ద్రావి । వల్లెరుగనిపాటుబడితివిగదురా । చల్లదనము కల్లుయిచ్చు ననుచుజెప్పి త్రాగితి గదురా । వల్లునొప్పులుదీరా వప్పుసారాయనుచు బల్కితిగదురా । చెల్లుభక్తికిని భంగి వేయవలెనంటివిగదురా । కొల్లగమాదువ తింటె మత్తుయెక్కువౌనటంచు । కల్లమాటలెల్లాజెప్పి యెల్లకీడుకుమూలమైతివి॥మ॥

రంగనాయకునెరుగలేక । పంగనామాలుబెట్టి । దొంగమాట

లాడుచుంటివిగదురా। భంగము జెందని నిర్వికారు నెఱుగకుంటివిగదురా। వంగియు గురుని పాదములు పట్టనేరవు గదురా। శ్రీలింగగురుని దయ పుల్లాదాస నెరుగవు గదురా। గంగయమునూలనడుమ। సంగము వ్రాడు జ్జర్ల రంగాయనుసాక్షిభూతు మంగళప్రదముగోరి॥ మ॥

౪. తత్వము తిశ్రిజాతి—ఏకతాళము—శహాన.

హరీ హరినీభజనచేయకుంటవతలగతియేమి ॥హరీ॥

అన్నదమ్ములలెడబాయకమునుపె। ఆలి నిష్టూరంబాడక మునుపే। కన్న కొడుకుదండించకమునుపె। కాయము అలసట తోయకమునుపె ॥హ॥

కర్రిబూనుకొని లేవకమునుపె। కంఠధ్వనితప్పించకమునుపె। అరుగ్రముందరికి వంగకమునుపె। అంగము తలవణకించకమునుపె॥ హ॥

అప్పులవాండ్లరికట్టకమునుపె। అన్నమొకరుదినిపించకమునుపె। దొప్పలోన చెయిగడుగకమునుపె। దోవతిబరువై తోచకమునుపె॥హ॥

దంతపటుత్వము దప్పకమునుపె। దవడలు లోనికి బోవకమును పె। చెవులకు మందము దోచకమునుపె। చెడిపొయ్యేవతల చేరక మునుపె ॥హరీ॥

వృద్ధాప్యం ప్రాప్తించకమునుపె। యుత్సాహంబులు యుడుగక మునుపె। నేత్రంబులు పొరగప్పకమునుపె। నిర్దయుడైకూలించకము నుపె ॥హరీ॥

ఎల్లలోకములు కల్లయనుచుమరి। శ్రీల్లిలింగగురు ఆర్యుబోధ చే। కొల్లిపర్వేంకట సుబ్బయాఖ్యుడు। అల్లయచల మేసత్యంబనుచును॥

౫. తత్వము-ఆనంద భైరవి—అటతాళము.

దేవా బ్రాహ్మణచిన్నదానరా। నన్ను తెలియ నెవ్వరితరముగాదు రా॥ దే॥ సాకారరూపమై। సర్వప్రపంచము ప్రాకారముగజేసి ప్రబలు చుండెదుదాన॥ దేవా॥ పంచాక్షరిజపము జేతురా। ప్రణవంపాదు దెల శి నడకనడతురా। ఫాలభాగమునందు పరమాత్మరూపమై। నీలాజ్యో తుల నడుమ వాలలాడుచునుండె॥ దేవా॥ రామనామము మాదిపూరురా

రాజయోగులు రతిసల్పెదానరా । వృషజిహ్వకునుమధ్యత్రిపుటస్థానము నందు । జపియించెపెద్దలచేర్చి రక్షించేటి ॥ దేవా॥ పంచాభూతములా త్మగానురా । చిత్తచంచాల చర్యాలు ద్రుంతురా । పంచవింశతితత్వ భావమతీతమై వంచానలేకను వాలలాడుచునుండె ॥దేవా॥షట్చక్రము లనడుమయుంపురా। హంసతంతెరూపకముగ నడిపెరా యెనసి డెబ్బది రెండు వేలనాడులయందు । పనిబూని సోహము పంపిణిగాజేసేటి॥దే॥ పంచవన్నెల కొలనలోపలానేను । పట్టిజలకము లాడుచుందురా ।కుం డలికిని నడుమ కొండబిళములోన మండలాత్రియమునుండి బయలును జూపె ॥ దేవా ॥ ధరలోనా శావల్యాపురములో లింగగురుని జపమున దేరుచుందురా మలిన రహితమైన మగువ జోగిపతీ రంగమాంబను బ్రోచు రాజీలలామను ॥ దేవా ॥

౬ కీర్తన. శుద్ధకాంభోజిరాగము ఆటతాళము.

భర్త దైవంబనుచు నెంచి అత్తమామల సేవజేసి ప్రస్తుతించినదాడది పెత్తనమునకై అత్తమామలు చచ్చుటేమరి మంచిదనుచు యిక భర్త మోటనియెంచి విటునిపోకుగోరెదె గాడిది ॥ భర్త ॥ పగయుబూనక దిగులుజెందక వగలునెరుగక తగవుగానని దాడది ॥ వగలుమాటలుకలి గియెంతో దిగులుజెందుచు తగవులాడుచు పగయుబూనెదె గాడిది । అన్నవస్త్రముజరుగకుండినవున్నసంగతినెరిగిమెల్లగజరుపుకున్నదిఆడది॥ కన్నకోర్కిగజేసినాపాలగలిగిన దయ్యమితడని యెన్నోవిధముల ప్రజల కల్లర దెల్పుచుండెదె గాడిది । భర్త ॥ ధనంగలిగిన తనగుణాంబులు ఘనముకొరకై దానధర్మము జెరిగినడిచేదాడది । ధనమదంబున బీదజన ముల త్రుంచిపల్కి పిన్నపెద్దల కనులు నెరుగకయున్నదె అదిగాడిది॥భ॥ అరిగి పొరుగూరు రాకయుండిన ప్రాణనాధునికొరకు నిరతం దారిజూచే దాడది॥ ఊరువెలుపటికంపి విభుని ద్వారపోయెను మగడటం చిటకాంద్ర కూసెదెగాడిది॥ జారచోరులజాడలెత్తక హరిదాసులనుగనివందనంబిడు ఆసెపుడమిలోఅడది జారచోరత్వంబెచేయుచు జారచోరులువారువీరని పల్కుచుండెదె గాడిది॥ భర్త ॥ చక్కదనములుబుద్ధిమంచియుయెక్కు వైనాదాన ననుచును చెప్పుకొననదె ఆడది॥ చక్కదనమలు యెంచికొ

నుచుపోకుజేయుచుకులికి అల్లవెరోతయనుచు యోచిగుసగుసలాడుచుం డెదెగాడిది ॥ భర్తః ॥ వల్లకాటికిచేరెగటములు యెల్లకాలము బ్రతుకబో మని ధృఢమునిల్పి పల్కుచున్నదె ఆడది॥ వల్లివల్లక మగనిదిట్టుచు యెల్లకాలము యిట్టిపోడు వల్లనని గట్టిగను బల్కి నూతికేగెదె గాడిది॥ భర్త ॥ బుధులు పెద్దలువచ్చినారని జనులు చెప్పగానువిని హృదయ మానందంబు నొందేదాడది॥ మదముహెచ్చి కొవ్వుపట్టి జ్ఞానులట పెద్దలటయని నవ్వులు హేలనముచేయుచు తిరిగిచెప్పెదిగాడిది ॥భర్తః॥ లింగగురునీరహాశ్యము తన ప్రాణనాధుడుయోగి తనకుదెల్పుచున్నదె ఆడది ॥భ॥ దొంగమాటలు యీ యర్రంశెట్టిపుల్లాదాసుని యని అంగడిచేరంబు కేగి గోలజేసెనెగాడిది ॥భర్తః॥

2 కీర్తన. బేహాగ్ రాగము. ఆదితాళము.

చెడిపోతావులే భడవతుత్తేరిలమీడికి నీవు॥ చెడిపోతావులే॥ చెడిపోక లుఖ్యామనసా కళివరమని కనుగొనిదెన బూడిచెలోనబారలె ఫీ మురికి గాడిదెనీవు ॥ చెడిపో॥

నిందెలుయెప్పుడు పెద్దలందరిని జేసెదావు అందుయెట్టివారలైన యుం దురని యెరుగలేవు సుందరాంగుడయిన గోవిందుని చెరితంబుబ్రహ్మా నందముగవినకనీవు పందివలె లడ్డులసుక్క తిందామన్న జోలెకాని హా రిని కిందామని యెరుగవుమూఢనీవు ॥ చెడిపోతావులే ॥ మొద్దువలె నీవుపెరిగి సద్దియేడి నిత్యతిని ఆత్మశుద్ధి యెరుగలేక యెరుక గద్దెవలెను బయినీడి శుద్ధలు చెప్పుచునీ వద్దనున్న హానినెరుగకబల్ గద్దరించిపల్కి పరుతో పెద్దమొండియెద్దువలెను దినములుగడపుచు గాశెద్దా చెడితివి లుద్దా ॥చెడిపోతావులే। వృంటవలెమనసమాయ అంటియుంటనియట్టు ల ముందు అంటనివిధమ్ము పెద్దలిదిగో చెప్పినారు తామరంటసు నీటిని కుమ్మరంటకు బురదయు బూడిదంటదు గచ్చకాయపక్కంటదు చింత కుండుదక మాటదాకాశమనిట్లందురు బుధులందరు అట్లుండెవారెఘను లులేక ॥ చెడి ॥ రండనీవు దుడుకులాను మొండుగజేయుచు నీ వుండె కొంపమర్మముందుండె సూత్రిమెరుగక షండుడు స్త్రీసంగమెరుగ కుం డినవిధంబునీ వుండెదావు లింగగురుని నేరుపున కొండబిలములోన చేరియుండే బయలునందుండి మిరియాల వెలుగొండదాస యెరుగ

కుంటు। చెడిపోతావులే।

౮ తత్వము. ఏకతాళము సావేరి రాగము.

బలె బలె గురుకరుణజూడగా బట్టబయలుగానున్నదిరా చరాచరంబుల తలంపులేకను చరించకను తానున్నదిరా॥ బలె। అష్టాక్షరి యామంత్రములోపల అనుభవమును గనుగొన్నదిరా।అష్టప్రకృతులును అష్టమదములును అణచితాను బయలైనదిరా॥ బలె॥ ఆరుచక్రముల కాధారంబై హంసోహంబును గన్నదిరా।అరమరలేకను యిరవైవక వెయ్యారునూరు హంసైనదిరా॥ బలె॥ అండపిండబ్రంహ్మాండములను గని ఖండములేకను యున్నదిరా। కుండలినడుమను యుండు జ్యోతిని దండిగాను గనుగొన్నదిరా॥ బలె॥ తత్వమశాది మహావాక్యముల తారకబ్రహ్మాంబైనదిరా। తత్పదత్వాంపదహాసి పదములలో తన్మయమును తానైనదిరా॥ బలె॥ పంచభూతముల పద్ధతినెరుగక పట్టువిడుపు లేకున్నదిరా। వంచనలేకను గురువుల హృదయము వాలలాడుచునే యున్నదిరా॥ బలె॥ పెరుగక విరుగక తరుగక మొరుగక అరుగక నంతట నున్నదిరా హరిహరాదులకు నలవిగాక గురుకరుణచేతగనుగొన్నదిరా॥ బలె॥ వృత్తిది బయలనె ద్వాదశాక్షరి వ్యూహాన తా గనుగొన్నదిరా।చిత్తములోపల షోడశాక్షరి ధి ధీ తలపకున్నదిరా॥ బలె॥ ధరణిలోను శావల్యపురములో దాసజనులు పరియింతురురా।దోషరహితుడగు లింగగురుని హృదయాసమునను నివాసమురా॥ పంచదశాక్షరి! పద్ధతి వెలిసితే పరమపదము బైలైనదిరా। ఆమరుగు దెలసి గుమ్మళ్ళసుబ్బయ్య గురుచూచెనచే బయలైనదిరా। బలె॥

౯ తత్వము. ఆనందభైరవి ఆటతాళము.

ఓరివినరామూఢ సంసారిమాయను విడరా। ఓరి॥ యేకుకతో హంసోహము జాడదెలసి కుడియెడమనాడు హంసాలనుబట్టికూడలేవదేమిసేతు॥వోరి॥ చక్కనివాడనికులుకు నీలోననీవు యెక్కువ తోభ్రమలు జెందకూ। ఒక్కరెప్పపాటులోన చిక్కెదవు యముని సేత రక్కసిమాటలుమాని నిక్కమునామాటనమ్మ॥వోరి॥ కొంచపగుణమూల జొరలుచు పంచేంద్రియముల మించిపరుగులును బారుచు వంచనసేయక నీవు మంచిగురునిపంచజేరి సంచితములు త్రెంచుటకును మంచి త్రోవవిదియెచూడు॥వోరి॥ చింతలతోటని తెలియరా చూడగా

దీనివింతల పుట్టిల్లుగానరా సంతకూటమౌనుదీని యెంతని చెప్పదునీకు కాంతలును పురుషులును గలయుటకు మూలగట్టు ॥వోరి ॥వన్నెచిన్నె లన్నిమానరా దేహము జూడయన్నటికి నమ్మరాదురా అన్నవినరతిన్న గానువన్నెలన్నియువిూరి వున్నయాత్మదెలసినీవువిన్నకన్నదిసున్నజేయు వోరి॥ సాదన రహితముజూడరా అష్టాంగయోగ బోధలను జిక్కబో కురా వాదభేదమేమిలేని సాదుజనులుచెంతజేరి బోధరూపమైనయాత్మ సోదన జేయరానీవు ॥ వోరి ॥ మిన్నుమన్ను సున్నజేయరా మా లింగ గురుడు కన్నబోధ మెన్నిచూడరా మన్ననాతో తన్నెకంటిరామలింగం దాసువేడు వున్నడ పరిపూర్ణమందు నిన్ననే తెరదీసినపుడు ॥ వోరి ॥

౧౦. తత్వము. నాదనామక్రియ, ఆటతాళము.

ఓన్నమశివాయారక్షరముల తొట్టారంభమాయెనే వుయ్యాలో రక్షకుడు చిన్మయుడు ఆ తొట్టిలోపల తానూగుచున్నడే వుయ్యాలో ఓన ॥ పంచాక్షరిదొట్టి పరిభలించిచూచితే ఆటలాడేతొట్టివుయ్యాలో శివాఆటలాడెతొట్టి వుయ్యాలో ॥ పంచాక్షరిచుట్టు పంచబ్రహ్మలపట్టు పంచభూతాత్మలేవుయ్యాలో ॥ ఓనమ ॥ మన్నునీరును అగ్నివాయువు తో నాలుగుకోళ్లుగావించిరే వుయ్యాలోశివా కోళ్లుగవించిరే వుయ్యా లో అష్టదిక్కులువెలుగు సృష్టిలోయెనిమిది కోళ్లుపట్టెలుజాపిరుయ్యా లో ॥ ఓనమ ॥ నలకయిరవైఅయిదు శారల తొట్టికి మనసుతోనల్లిరే వుయ్యాలో శివా మనసుతో నల్లిరే వుయ్యాలో యెరుపు తెల్లును నల్పు పసిడివన్నెలుగూర్చి పరుపులే పరిచిరే వుయ్యాలో ॥ వోన్నమ॥ అండపిండము రెండు ఆ తట్టు యీ తట్టు దిండ్లుగావించిరే వుయ్యాలో శివా దిండ్లుగావించిరే వుయ్యాలో రేయుబగలును రెండు స్తంభములుగా జేసి బయలు దూలమెత్తిరుయ్యాలో ॥ ఓన్నమ ॥ అశ్వాసనిశ్వాసత్రాళ్లు రెండుగజేసి తొట్టె నిలగట్టిరె వుయ్యాలో శివా తొట్టె నిలగట్టిరే వుయ్యాలో పంచకన్యలగూడి పంచవేదము చదివి తొట్టిన బట్టూచిరే వుయ్యాలో ॥ ఓన్నమ ॥ అధారస్వాదిష్ట మణిపూరక చక్ర మున ఆతట్టుకూగెనేవుయ్యాలో శివా ఆతట్టుకూగెనే వుయ్యాలో అన హాతవిశుద్ధ ఆజ్ఞేయచక్రమునకీ తట్టుకూగెనే వుయ్యాలో ॥ ఓన్నమ ॥

సత్తుచిత్తులు రెండు సవరసము జేసికొని లోచూపుజూచిరె వుయ్యాలో శివా లోచూపుజూచిరె వుయ్యాలో లోచూపు వెలిచూపు జగమెల్ల తనచూపు జ్యోతిమైవెలగునె వుయ్యాలో ॥ఓన్నమ॥ యిరవై ఒక వెయి ఆరునూరు హంసయిరువుగనిశించరే వుయ్యాలో శివాయిరువుగనిశించరే వుయ్యాలో యిరుగు తరుగులేక యిరుగడలయందుండు యిది బ్రహ్మ పదమనరే వుయ్యాలో ॥ఓన్నమ॥ సృష్టిలోజనులకు యిష్టలింగాగురుని గుట్టుదెల్పినదిదె వుయ్యాలో శివా గుట్టుదెల్పినదిదె వుయ్యాలో గుట్టు దెలసి గంజి యల్లమందదాసు పరము జెందినదిదె వుయ్యాలో ॥ ఓన్నమ॥

౧౧ తత్వము ఆట ముఖారి.

గురిజూచి గురునమ్మి గురి జేరె మనసా సద్గురుకన్న దైవంబు లేడే వో మనుసా ॥ గురుజూచి ॥ చెడుగుణంబులజిక్కి చెడిపోకేమనసా చేరి సద్గురుని సేవించావెమనసా ॥ గురిజూచి ॥ యితరసరులమాటల్ వినబోకె మనుసా వింటేను నీకెంత మోసమెమనుసా ॥ గురిజూచి ॥ ఈడ పింగళ నాళ్ళజాడగనె మనుసా కూడికుంభకమందు చేరుండె మనుసా ॥ గురి ॥ షఠాడుయేరులుగడిచె జాడగనెమనుసా యేడుమేడలుదాటే విధము గనుమనుసా ॥ గురి ॥ రంగాదాసునివాక్యం అంగూగమనుసా వొంగి లింగాగురుని పొడగనె మనుసా ॥ గురి ॥

౧౨ తత్వము. హిందూస్తానికాఫీ ఏకతాళము.

ఎంతోమంచిగురుడు మాకు యిపుడే దొరికెనే చంతాకురమ్మని మా చింతాబాపెనే ॥ఏం॥ మాయవాదులతో పొందుమానుమనినే దేహము అస్థిరమని తెలియపరచెనే ॥ ఎం ॥ కామక్రోధమూల నెల్ల కాల్చుమనెనే బాములనే పాపమూల పారదోలెనే ॥ ఎం ॥ పంచాక్షరిమంత్రమును పాడుదెల్పెనే సంచితములు ద్రుంచూనని సరణిదెల్పెనే ॥ ఎం॥ శ్రోత్రనేత్రనాశికములు మూయుమనెనే సూత్రమైనా నాదమును సూటిపరిచెనే ॥ ఎం ॥ రేచకము ఫూరకము సూచనిచ్చెనే కాశిగంగ యమునతావు గలయజూపెనే ॥ ఎం॥ కుడియడమ తిరుగునాడుల కుదియబట్టెనే కదలక మనుసుంచామని క్రమముదెల్పెనే ॥ ఎం ॥ అండపిండ బ్రహ్మాండంబుల అరలుదీసెనే కుండలి మధ్యమున జ్యోతినుండచూ

పెనే॥ ఎం॥ సోహమనెభావము బహుసోద్యమనెనే సొలసి పవనుడుండె తావుస్వష్టపరచెనే॥ ఎం॥ పదిరెండుమాత్రల మందుపట్టజెప్పనే పదిహా రు అక్షరమూల బయలువరచెనే ॥ ఎం ॥ పంచదశాక్షరి బహుమంచి దనెనే మంచినదురితాములను ద్రుంచునననే॥ ఎం॥ ధరణిలో శావల్య పుర నివాసుడననే మదిన లింగగురుని నెపుడు మరువకనేనే॥ ఎంతో॥ సవిశేషప్రసాదముల సరణిచెప్పెనే భువిలో నరసాంబయిక పుట్టెననే ఎంతో॥

౧౩ తత్వము ఢిలాంబరి ఏకతాళము.

పలుకవేమిరామచంద్ర పంతమేలరా ।। పండువెన్నెల బయలులో నన్నుండజేయరా ॥ పలు ॥ పంచముద్రిలసాధనముల ఫలముయేమిరా । పరమపదవిజేరుటకునూ బాటదెల్పరా । పలు ॥ కుడియెడమ తిరుగు నాడులకుదిరికేమిరా యెడతెగనిబ్రహ్మమనేదేదో తెల్పరా॥ పలు ॥ కా టుకపక్షులరెంటిసూటిదెల్పరా । కోటలన్ని దాటుటకునూ బాటదెల్పరా ॥పలు॥అష్టదళముల లోనయుండు నిష్టయేమిరా । అట్టిసద్గురు జేరుటకును గుట్టుదెల్పరా ॥ పలు॥ హాయంబ్రహ్మమనే భావమందజేయరా। స్వయ ము లేదు చూడుటకును సోద్యమేమిరా॥ పలు ॥ మూలము లేనట్టియొక్క ముడినిదెంచరా। యూలభ్రమినుద్రుంచివేసేదేదో తెల్పరా॥ పలు॥ మరణ జననమూలు లేని మరుగుదెల్పరా । మనమునందు లింగగురుని మరువ జాలరా॥ పలు॥ ధరణిలో శావల్య పురమునందుయుండరా । కరుణతో శీలమెల్లమంద కాంక్షదీర్చరా ॥ పలు ॥

౧౪ తత్వము నాదనామక్రియ చతురశ్రిజాతిలఘువు.

ఒక్కడేబ్రహ్మంబెక్కడ లేదిక దిక్కులుచూడకు వరేవరే ।
చక్కనిగురువరు పాదముగని యీ సవరసమెరగరవరేవరే ॥ ఒ ॥
మక్కువతోడుతహంసరాయుని చక్కగ దెలియరవరేవరే ।
కుక్కలకూతలువినకను నెప్పుడు గురిజెందకురావరేవరే॥ ఒ॥
పంచభూతములు పంచవికారము పదిలపరచరావరేవరే ।
మించినదురితములన్నిటినీవు త్రుంచివేయరా వరేవరే ॥ ఒ ॥
యిను వైవక వెయ్యారునూరు హంసిరువునుగనరా వరేవరే ।

యిరుగు తెరుగు లేనట్టి బ్రహ్మము యిదుగో చూడరవ రేవరే॥ ఒ ॥
అష్టమదములవీడిన బ్రహ్మ శ్రేష్ఠులగూడర వరేవరే।
దృష్టిలో వలదివ్యలింగని నిష్టతో జూడర వరేవరే ॥ ఒ ॥
పంచవింశతి తత్వములన్నిట యెంచిత్రుంచరావరేవరే!
పొంచిపొంచిసద్గురునివల్ల యీపోబడిగనరా వరేవరే ॥
భయమువిడచియు నిర్గుణతత్వము శాటదెలియరా వరేవరే।
ప్రియముజేసి యీమాయనుద్రుంచే రహస్యాబిదిరా వరేవరే ॥ ఒ ॥
వప్పెను ద్వాదశి వైపుదెలసి యిదియెప్పుడుమరువకు వరేవరే।
తప్పక షోడశి లింగగురునిచే దరికిజిమ్మర వరేవరే ॥ ఒ ॥
కలతో సరియనె పంచదశాక్షరి క్రియను చెలియరా వరేవరే।
వుల్లమందు శీలమెల్లమంద యీయుక్తినిగనె రానరెవరె ॥ ఒక్క ॥

౧౫. తత్వము దేశీయముఖారి ఆటతాళము.

ఎంత జెప్పినవినవె మనసనీవు అంతరాత్మనీగనవే ఎంతజెప్పినవినవు యేమిసేయుదునిన్ను చింతలన్నియుమాని శ్రీగురు చెంతనను జేరుండె మనుసా ॥ఎం॥ చరమక్షరములీడవె మానసపూర్వపరము లేదోకనవె। హరిహరబ్రహ్మల కందశక్యముగాని పరుగుదెలసును బ్రహ్మవేత్తమరు వకను సేవించెమనసా॥ఎం॥ సందేహములువిడవె మానసనీయందు యాత్మనిగానవే అందుయిందనరాక పొందశక్యముగాక సందుగొందు లు నిండియుండెడి సమరసాత్మని గనవేమనుసా ॥ఎం॥ యిదిగో ద్వాదశికనవె మానస పరిపూర్ణమదుగో చూడవే వదలక లింగగురు మదిని నెప్పుడు మరువ తగను షోడసియనుచు జెప్పినదానిని గుర్తెరుగు మనుసా ॥ఎం॥ కల్లమాని తెలియవేమానస జగమెల్లయిట్టెగానవె వుల్లమందుశీలమెల్ల మందదాసు! మల్లిచూడకు పంచదశియనె మర్మ ముమ గనుగానవెమనసా॥ ఎంత॥

౧౬. తత్వము నిలాంబరి ఆటతాళము.

దశేవింద్రియములార ధాత్రిలో సద్గురుని దరిజేరగతిగాంచరె। మీరు వశముజేసుకమదిని వంచి షడ్వర్గములద్రుంచి యాత్మనుగాంచరె॥ దశ ॥ పంచభూతము లాత్మ పద్ధతిని దెలిసికొని సంచితంబులు ద్రుంచరె మీరు

పంచవింశతితత్వభావమందున నిలచి పరతత్వమును గాంచరే ॥ ద ॥
చత్తుచిత్తులరెంటి సవరసముదెలశికొని నిత్యయాత్మునిగాంచరే మీరు
వత్తిలేనిజ్యోతివెకరిని దెలశికొని వటపాత్రునటుగాంచరే ॥ ద ॥ నవ
ద్వారపురములో నాడుపాత్రుని జూచి నాటకుండితడనరే । మీరునాగ
కూర్మ కృకుర నాడులను గనిశించి వడినాళ్ళమునజూడరే ॥ ద ॥
గంగయమునుల నడుమబంగారుమేడలో అంగనామణిగాంచరే మీరు
మంగళపత్రిదమైన మండపంబును జేరి మగువతో గూడుండరే ॥ ద ॥
తప్పనుద్వాదశినెపుదెలశిమదిని యెప్పుడుస్తుతింయించరే మీరు తప్పక
నుషోడశిని దరికిజమ్మొరుకను తగదని విరశించరే ॥ ద ॥ సృష్టిలో శావ
ల్యపురమునను లింగగురుసూచనిదియనినమ్మరే మీరు ధరలోనుచంద్ర
గిరి పాపయాఖ్యునిబోధించు దైవంబు యితడనరే ॥ ద ॥

౧౭. కీర్తన ఆనంద భైరవి ఆట.

కాళ్లుజేసిన తప్పుచెప్పరా యీకాయముగనినాడి దిద్దిప్పర కమల
లోచన యిట్టికర్మబంధముద్రుంచి బాముాలుబాపర భక్తజనార్దన॥కా॥
స్థూలదేహము సృష్టిదప్పిరా చాలఘోరములెల్లాపెగప్పిరా లాలితం
బుగ యిట్టిభారములెడబాపి కారకభర్తవని చాలగనమ్మితే ॥ కా ॥
మూలములెనియాదాయరా యీజ్వాలమునకునోర్వజాలరా వ లలోచ
న యీ పాపములనుబాపి కాపాడిరక్షించు కమలాదళేక్షణ ॥ కాళ్లు ॥
పంచేంద్రియములుపాలించరా । చాలమించితత్వములు సోదించరా ।
సంచితంబులుమాన్పి నారసనయనన న్నించక సద్గతియేదో చూపవదేర
కాళ్లు ॥ సందేహములు దీప నేటికి మాలింగగురుని భక్తకోటికి అందు
యుందనరాక యెందుజూచిన పొలుపొందసూదిమోప సందులేనాత్మచే
కాళ్లు॥ కామజనక నన్నుగావరా కావూరి పేరయ్యాఖ్యుబోధివరా ॥
ధరలోవయ్యకంటి ధాముడవైవచ్చి పరగనిరనై యోగోభావమందుం
చరా ॥ కాళ్లు ॥

౧౮ కీర్తన. నీలాంబరి ఏకతాళము.

రామనామము మహారసము గోత్రిలుటాకురహాస్యముగనరాద వో
మనుసా నీవు ఘోరసంసారము వారధిలో మునిగితేలుట మేలటవో

మనుసా ॥ రా ॥ ఇల్లువాకిలినాది ఇల్లాలునాదనుచు యాలభ్రమసితి వెర్రివో మనుసా ॥ కాయము స్థిరమని కానక తిరిగేవు కడ తేరు టేలాగ వో మనుసా ॥ రామ ॥ చుట్టుకోటలుగట్టి నడుమ డాబాల్దీర్చి నమ్మిబహు దిరిగేవెవో మనుసా । సొమ్ములెల్లిహ్యాధిగ్రమ్మివచ్చినయపుడు సొమ్ము నీదెల్లానె వోమనుసా ॥రా॥ కామాదులనుబెంచి కాంతలతో కన్నుగానక తిరిగేవెవో మనుసా । కాల్లగుణముల యముని పోట్లాచే చిక్కియు కష్టపడుటమేలావోమనుసా ముసుగిడి గొలుసులు ముత్యాల పొకట్లు ముద్దుటుంగరాలు వోమనుసా ॥ మంచివచ్చివ్యాధి మరాలమంచములోన ముట్టనెవ్వరురారె వోమనుసా ॥ రా ॥ విత్త మార్జన చేసి తినక అర్థులకివక తి త్తిలోదాచేవెవో మనుసా॥ రా॥
తిప్పలున్నవిముందు యెప్పుడో యేవేళ్లో చెప్పకపోయెనె వోమనుసా ॥ రా॥ గొప్పలంచముదిని కోరటులో బహు తప్పుసాక్షుము బల్కెవోమనసా తప్పుకయముడొచ్చి ఖండించి కత్తుల చెండివేసునుగదె వో మనుసా రా॥ తనయులు చుట్టాలు తనవారుయనినమ్మి తలపోయకె వెర్రివో మనుసా ॥ తనువువిడచినవేళ సమయంపులోపల తనవెంటరారైనె వో మనుసా ॥ రా ॥ సృష్టిలో శావల్యపురమున గనులింగగురుని జేరగరావ వో మనుసా । నీవు అనుకూలమైన గురూపదేశ యోగమభ్యశించ రాదా వో మనుసా॥ రా ॥ నష్టాము లేనాత్మ నందిరాజుతోట నారాయణుని జేరె వో మనుసా కిష్టములెడబాపి కందుల తిరుపతిదాసుని రక్షించువో మనుసా ॥ రా ॥

౧౯ తత్వము. నాదనామక్రియ ఏకతాళము.

అరూపమైన యఖల ప్రపంచము నిరూపమైనదిచూడుడీ స్వరూపమనియెటి సూత్రదారియై సోద్యముగున్నది గనుడి ॥ అరూ ॥ అకార వుకార మకారములచే నమరియున్నదది చూడుడి వికారమనియు టవిల్లు కట్టుకొని విస్తరించినది గనుడి॥ అరూ॥
అర వైనాలుగుకీళ్ళ నాళ్ళతో ఆటాడుటయదిచూడుడీయిర వైయైదిటస్థూల శరీరముయిమ్మైయున్నది గనుడీ॥ అరూ॥ ఈడపింగళసుషుమ్న నాళ్ళంబీడినడుమనాజూడుడీ వింతగాను యీ ఫాలభాగమున ఈశ్వరుడున్నడు

గనుడీ ॥ అహా ॥ పంచవన్నెల పద్మములో రెండు ప్రమిదలున్నవవి
చూడుడీ ప్రత్యగాత్మయనెచమురున జ్యోతై ప్రభలుచున్నవవిగనుడీ
ఆహా॥ తాడుకోలలేకుండే తెరుకను జాడదల్పె నదిచూడుడి జోడులేక
మాలింగగురుడు యిల జోలిబొందడది గనుడీ ॥ఆహా॥

౨౦ కీర్తన ముఖారి ఆట.

యింతిరో యినుమెళ్ళ యీ భావన్నారాయణాంతర్య మేమందును
తెలియగరాదు అంతారంగమునందును కాంతాలు పురుషులు సంతోష
మందుచూ వింతగనటియింతురింతె మిక్కిలి లేదు మంతనంబునసమ్మ
కనుగురు చింతజేరియునుతులొనర్చిన అంతలో భవజలధిదాటె అంతమా
ర్గముకనులగనదగు ॥యింతి॥ సంతకూటమువంటి సంసారములు జేసి
పంతమాడుచుందురు యీ జనులెల్లా తంటాలుబడుచుందురు యెంత
వారునుబలవంతులైయున్నారు కొంతకాలములో ప్రాణాంతమునొం
దుమ రింతమాత్రము తెలియకను దావంతిమతులై యుందురిటు వేదాం
త వేత్తల చెంతజేరిన చింతలేనిపదవిగాంతురు ॥ యింతిరో ॥ మనుజ
మాత్రులు సర్వమును కాంక్షించియు మరలకనికానకనున్నారు తనువు
లుబొయ్యేనని తెలియలేకున్నారు అనుమానాస్పదమైన తినువికారముల
జే బెనగొని మదిసత్వమును మరచియున్నారు రని భావన్నారాయణుని
మదినునిచి సద్గురుకరుణనడసియు అనుదినంబాయాత్మయందును మన
మునను పొడగాంచవలయును ॥యింతిరో॥ యిలలోను యీ భావములు
దెల్పెఘుసులెవరు గలరాని నెతకాగను వెలసెను లింగమూర్త్యులరూప
మునదోపగను వెలసేసి గురుదీక్ష గలిగి సేవించాగ తులలేనిపదవిని చ
రియింపకనుదెల్పె శోభిభవాంబుచేయు సుకృతము ఫలితముగ సంభా
వ్యమయ్యెను తెలియాగగోపయ్యదాసుని చలనతత్వము రహితమాయె
ను ॥యింతిరో॥

౨౧ తత్వము. నాదనామక్రియ ఏకతాళము.

కలకాలము యుగములాయె కపటజనులు ప్రభలమైరి తల్లిపిల్లలకు
తగువులాయె ధర్మమైతే లేకపోయె వల్లలేని నిందలాయెను ఘోరంగ
ఘామ వావివరస వరదపోయెను ॥కలా॥ మంచిదైవతములయములాయె

కొంచపగుళ్ళుగొప్పలాయ కొడుకుతండ్రినిగొట్టుటాయ లంచగాండ్లరాణువాయ రాజనీతిలేకపోయె మించినచేతికిమేరలాయను వోరంగధామ గురువుకుజెప్పె శిష్యుడాయ కులముయెక్కువతక్కువలాయ పెద్దలని తెలియరాయె పెండ్లముతో చుటరికమాయ మించినచేతికి మేరలాయెను వోరంగధామ। సుష్టగుణములీడరాయ దురితమందుజేరుటాయ బ్రహ్మపదవిజెందరాయ లింగగురుని జేరరాయ మించినచేతికి మేరలాయను వోరంగధామ॥ బాధలన్నీ వీడరాయ బయలుయందు జేరుటాయ దోసపాటి నాగలింగ నాదలయము జేరుటాయ మించినచేతికి మేరలాయను వోరంగధామ।

౨౨ తత్వము నాదనామక్రియ ఆట.

చూచేవారికి యుక్కడనున్నది సుందరమైనదె మావూరు
సంధితెలియని పండుమానవుల కందరానిదె మావూరు ॥ చూ ॥
అండపిండబ్రహ్మాండమధ్యమున నిండియున్నదె మావూరు।
అండబాయకను దండితేజములో కుండలిగలిగినదెమావూరు ॥చూ॥
చుట్టుకోటల నట్టనడుమను కొట్టిడీగలిగినదె మావూరు।
కొట్టిడిలోపల కోమలితెలిసితె బట్టబయలురా మావూరు ॥ చూ ॥
సురులుమునులు ఘనసూర్యచంద్రులు చుట్టుకయున్నదిమావూరు।
అట్టెసోహమనె అనుభవముతెలిసి శెహరిహారులున్నది మావూరు॥ చూ॥
రామనామము నమ్మినవారికి యిమ్మయియున్నది మావూరు।
రామనామము నమ్మనివారికి రొమ్మునగాలమె మావూరు ॥ చూ॥
వచ్చేవారికి మావూరె వర మిచ్చేదన్నది మావూరు॥
కోటలో నీవ్రభు నీటుగ తెలిసితె కూటమిగలిగినదె మావూరు।
కూటమిపైనా లింగగురుని మదికోరిభజించినదె మావూరు ॥ చూ ॥

తత్వము ఆనందభైరవి ఏకతాళము.

౨౩ కీర్తన భక్తిమార్గం లింగాదాసుగారు చెప్పినది.

రామయ్యనామనవి వినరాదా రఘురామా నామనవి వినరాదా ॥
రామా రవికులసోమా జగదభిరామా తారకనామాపర్భోహారి ॥ రా॥
మీరు సద్భక్తితో జోహారు చే శరణన్న వేరు జేసేటివారుకారు దేవర

వారు ॥ రామయ్య ॥ ఇట్ల నీవినిపీనసట్ల వున్నావునాపట్ల హా హా హా నీమదెట్లగరుగునయ్యా॥ రామయ్య॥ చాలు యింతట బహుమేలుశీఘ్రి ముగా మమ్మేలు నీ పాదసేవచాలు వరహాలు చాలు ॥ రామయ్య ॥ పట్టిమిమ్ముల అరికట్టి మీకొక్క యాజ్ఞపెట్టి సాధింపకున్న నట్టివాడన వయ్య ॥ రామయ్య ॥ వింతగగోరి బలవంతు డవనిజేరి నంతలోగాచి బ్రోచ్రివు పంతమిడచిహరి ॥ రామయ్య ॥ హల్యా సంరక్షణ కౌసల్యా నం దనధర శావల్యాపుర విహారకల్యానగుణ శీతా ॥ రామయ్య ॥

౨౮ మంగళహారతి ఆనందభైరవి ఆట.

అంగనమణులార పొంగూచుగురునకు మంగాళారతు లివ్వరే ॥ భంగముగాని సంగతి గనుగొనరె ॥ అంగ ॥ పంచాభూతములాత్మ పద్ధతిగనుగొని సంచితంబులుదు్రించరే వంచనలేని మంచిమార్గము దెలియరే ॥ అంగా ॥ ఆరుచక్రిములకు ఆధారముగనడిచె హంసోహము నుదెలియరే రవి సోహముల రయముచోటును గానరే ॥ అంగా ॥ తారకమంత్రము కీలుదెలుసుకొని తత్వమూలముదెలియరేసత్తుచిత్తు సవ రసమును గానరే ॥ అంగా ॥ అండపిండములాకు ఆధారముగనుండె కుండలిగనుగొనరే అందునమండు దండిజ్యోతిని దెలియరే ॥ అంగా ॥ అష్టామదముపోడి దిృష్టిలోపలనున్న దివ్యలింగనిజూడరే స్పష్టముగాను నిష్టతో గనుగొనరే ॥ అంగా ॥ పట్టిదిజగమని బట్టబయులునుగని దిట్టా ముగనుదెలియరే దీనందెరుక పుట్టాలేదని నమ్మరే ॥ ఆంగా॥ సృష్టిలో శావల్యపురమున లింగగురు గుట్టుగట్టిగదెలియరే నష్టములేని గట్టియా త్మను గానరే ॥ అంగా ॥

౨౯ తత్వము నీలాంబరి ఏకతాళము.

అదిగో శ్రీకల్యాణవాసము ఆత్మకమలమునందె నివాసము వుజ్వల మాహాజ్యోతి ఓంకార పీటమున పొదిలేటి చిద్బింబు పొందుపరచినవారి కదిగో ॥ శ్రీ ॥ మూడుశాయలుగల అండము ముగ్గురు మూర్తుల కది స్థాన గుండము ఈడాపింగళమధ్యనాడు శుషుమ్న మండాడేటి హంసను జోడుబాయనివారి కదిగో ॥ శ్రీ ॥ రెండురేకుల తమ్మిసందూన మధ్య నుండేటిమణి దాసిపొందూన కుండాలికిని నడుమ కొండాబిళములోన

మండాలత్రయమున ఖండమైనజ్యోతి ॥ అదిగో ॥ కరతలమున యిష్టలింగమతా కంఠమమరగట్టినవాడే జంగమూ సిరముగాగురుపాద తీర్థప్రసాదములు పరితృప్తినొంది బ్రహ్మాంగన్నవారికి ॥ అదిగో ॥ ఘంటారవము వినుకుంటాను మా లింగగురునిగనుగొంటాను మింటావేయు దళములమండపంబులోన జంటాయు జ్వాలేకనంటి చూచినవారికదిగో॥ శ్రీ॥

౨౬. తత్వము కల్యాణి ఏకతాళము.

చూడనె కాయాపురి చూడగసోద్యామాయె వక్కలెవృక్షమాయె లెక్కకు మిక్కిలాయె॥ చూడ ॥ ఆర్గురు ఆటకాండ్లు ముగ్గురు మూటాదార్లు వక్కనుసుభేదారు చెప్పక లేచిపోయె ॥ చూడ ॥ తాంబురతీగెపోయె తాళముపగిలిపోయె మద్దెలవోడుబోయె మర్యాదలేకపోయె చూడ॥తిత్తియు చినిగిపోయె పిట్టయులేచిపోయె ఆడేదిఅలిగిపోయె అందరు నవ్విపోయె ॥ చూ ॥ ధరణిలోశావల్పుర దాసుడు లింగగురు చెప్పుటనిజమాయె చేష్టలుపట్టిదాయె॥ చూ ॥

ప్రశ్న— సద్గురుస్వామి వినుకొండతాలూకా పీవూరు పురంబున మఠము స్థాపించియుండెను. అందు శ్రీ శ్రీ శ్రీ గోపాలుని అజ్జయ్యగారు ఐక్యమును గాంచిరని వింటిమిగాని మరల శ్రీ జొన్నాభట్ల స్వయం బ్రహ్మానంద స్వాములవారిదని వాడుక గల్గెను నెందువలన.

ఉ—శిష్య ఆమఠము శ్రీమదార్వేల నియోగులలో కీర్తివరులును శాస్త్రజ్ఞులును సాధుపూజా దురంధరులును భక్తజన కల్పవృక్షములును నగు శ్రీశ్రీ శ్రీగోపాలుని అజ్జయ్యగారున్ను వారిపత్నిగారగు రామసుబ్బమ్మగారున్న యీ దంపతులు భక్తాభిషిక్తులయ్యు శ్రీ తుంగతుర్తి బుచ్చయ్యగారివలన అక్షరమునుపొంది కృతార్థతాకొరతచే జేలింగయోగినగు నాచే ఆసందేహమును సరిచూచుకొని పతి భతలు పరమైక్య సంధానులైరి వీరికి సుపుత్రులు ప్రథమకొమారుడు శీతారామయ్యగారున్ను ద్వితీయులు నరశింహయ్యగారున్న తృతీయులు పేరయ్యగారున్ను యీసుహృదమహాత్ములు ముగ్వురును పితృవాక్యాజ్ఞానుబద్ధులై నిరువది సంవత్సరములు బ్రహ్మానందకరముగా మహోత్సవములు జరిపిరి పిమ్మట యీ గ్రా

మనివాసులగు జొన్నాభట్ల స్వయం బ్రహ్మానంద స్వాములవారి కర్పించిరి.

ప్ర— శ్రీ సచ్చిదానంద పరిపూర్ణస్వామీ యీ జొన్నాభట్ల స్వయం బ్రహ్మానందస్వాములవారిని ర్యాణమునుగూర్చి ఆమహిమ శెలవివ్వ గోరుచున్నాము.

ఉ— శిష్య తిలకులార! చెప్పెదనువినుడి.

శ్రీ జొన్నాభట్ల స్వయం బ్రహ్మానంద స్వాములవారి నిర్యాణ

—♦ సీ స మా లి క. ♦—

శ్రీవేదశాస్త్రి గురువరు శేవా ధురీణుండు పరిపూర్ణ భావనిబ్రాజి తుండు
ఆదిమధ్యాంత హీనాత్మ్యాత్మ్మడఖండ చిదానందుండచలసిద్ధాంత వేది
పామరజనమనో బంధమోచనకారి సకలాంక రాజయోగాన్వితుండు
బ్రహ్మైక్యసంధాన పరుడాగమాంత విశేషజ్ఞ జనమౌళి శేఖరుండు
శ్రీమతో స్వయంబ్రహ్మానందగురువర్యుడధ్యాత్మయోగీంద్రులభినుతింప
సరవిమీర విరోధికృతువత్సరాశ్వీజ శుక్లయేకాదశి శుభదినంబు
శోభించు గురువారరోజును శతభిషనక్షత్రమును నివియు నమరియుండ
హరిహరబ్రింహ్మను లందశక్యముగాని యలఘుసమాధి నిశ్చలత నొంద
దలచి శాస్త్రోక్తవిధానంబుగా విమానాధిరూఢుడైన యవసరమున
జెలువొప్పగా మేన నలదినగంధంబు పొలుపొంద ధరియించుభూతిగాగ
పుణ్యాత్ములర్పించు పుష్పమాలిక లెల్ల రమణీయ భుజగహారములుగాగ
మతిమంతులైనట్టి మహనీయజనులెల్ల గీర్తింప పరశివా కృతివహించె
లోచనోత్సవముగా జూచుజనంబుల కత్యంతసంతోష మావహిల్ల
భాసిల్లు పీపూరు పురమందుఘనమైన సర్వజనంబులు సన్నుతింప
చావుపుట్టువులేని తావుచెప్పెడివార లెవరొకోయనికొంద రెన్నుచుండ
మరికొంద రద్వైత మతిముపదేశింప గలవార లెవరంచు గాసిజెంద
నిటువంటి గురువర్యు నెటులగాంచెదమంచు పాటిమీరగభక్తకోటులెన్న
బరతత్వమర్మ మేర్పడదెల్పుదేశిక వరులెవ్వరనిపాజ్ఞ వర్యులెన్న
గారణాపేక్షతో గలవారలిటువంటి గురువర్యులెవరంచు గుందుచుండ
సరసాత్ములగుసాధుజనులిందు రా రేమొయనుచున కొందరుమహదారిజెంద

సంతతాత్మనాత్మ సరణిగావించిన భక్తులానందమున గొనియాడుచుండ
లాలితంబుగ నారికేళఫలంబులు ప్రియమొప్ప గొందరర్పించుచుండ
పుణ్యాంగనాజనంబులు వేడ్కమీర కర్పూరనీరాజనంబులు నొసంగ
నేటివీపూరి పేటలో ఘనమహా ధన్యులెన్నగ మహోత్సవముతోడ
బరతెంచిజవ్వాదుల లింగయార్యుడు ఘనతనిల్పిన సమాధినివసించె
బుధులెల్ల సాతసంబున బొంగుచుండగా మాలికరచియించె భక్తితోడ
గురువరారధన పరగంగ జేసిరి గుణవంతులై బుధకోటులెన్న
గీ॥సచ్చిదానందగురుమూర్తిసచ్చరిత్ర। మవనినాచంద్రతారకంబగుచువెలయు
బరగవినరయ్యజనులారభవ్యమతిని। సాదియము లేదుమీకునానంద
మొదవు॥

శ్రీ సచ్చిదానందచలగురు పరంపరము

శ్రీ దత్తాత్రేయ గురుస్వాములవారు శ్రీ సచ్చిదానందచల పరిపూర్ణ
వారికి శిష్యులు పూదోట లింగావధూతగారు (మవధరించె
అల్లాడుపల్లె వీరప్పయ్యగారు వీరి శిష్యులు
శ్రీ సదానంద స్వాములవారు యాగంటి లక్ష్మయ్యగారు
పోతులూరి వీరబ్రంహంగారు వీరబ్రంహంగారి శిష్యులు
దూదేకుల శిద్దప్పగారున్ను శిద్దప్పగారి శిష్యులు
పలకగాళ్ళపల్లె గోవిందస్వాములవారు జంగం
అమరలింగంగారు అమరలింగంగారి శిష్యులు
శేషారాజుగారు శేషారాజుగారి శిష్యులు చెంచురాజుగారున్ను
చెంచురాజుగారి శిష్యులు అమినిగడ్డ కోటప్ప దేవరవారు
వట్టివేళ్ళ పీరయ్యగారున్ను పీరయ్యగారి శిష్యులు
పూదోట శేషావధూతగారున్ను శేషావధూతగారి శిష్యులు
జవ్వాదుల లింగాయోగిగారున్ను సరిపూడి నందయ్య యోగి
గారున్ను లింగాయోగిగారి శిష్యులు గుత్తి రామస్వామిగారున్ను గంజి
యల్లమంద దాసుగారున్ను ఉనుమెళ్ళ గోపాళయ్య గారును తన్నికంటి
రామలింగాదాసుగారున్ను పాలపాటి వీరాదాసు చన్నంశెట్టి వీరాస్వా
మియోగిగారున్ను జోగిపల్లి రంగమ్మగారున్ను వీరు శ్రీ గురుస్వామి

అధికారయను పొందియున్నారు అధికారమును బొందనివారలు యిం కా కొందరున్నారు వీరిలో మేము చిన్ని శిష్యులము యీచిన్నిపశ్న గోరిన శ్రీ శ్రీ శ్రీ జవ్వాదులలింగాయోగిగారి శిష్యులము.

౧ కొల్లిపర కోట్లింగంకుమారుడు వెంకటసుబ్బయ్య

౨ యర్రింశెట్టి లక్ష్మయ్యకుమారుడు పుల్లయ్య

3 చాలకోటదాసుకుమారుడు పుల్లాదాసు.

౨౭ తత్వము. ఆనందభైరవి. ఆట

జొన్నాభట్ల స్వయంబ్రహ్మానంద స్వాములవారి తత్వము.

మటమునకు బోదాము రారే। యోగమర్మమును గనుటజాలు మే లే మటమునకు బోదాము గటములోపలనున్న నటకత్రిశయమని వైపు దెల్పుదురట ॥ మట ॥ భూతిపాలను శేక దద్దీ। కుడిచెవ్వులో తారకంబు ను పొందపరచి। తప్పకను తారకము మెప్పుగాబోధించి। చెప్పిసన్ముఖ ప్రణవ నాదమును వినిపించె ॥ మట ॥ ఆధారస్వాధిష్టమునను। షడుచ క్రమాంసప పిశి నిశ్చయమును అరసియుకునై వక్క వెంట్య ఆహ్నారును హంసలయము యేటి। అగ్గజూపితురట ॥ మట ॥ రూపంబులన్నియు మదిని। నిరూపంబులని నిశ్చయించియును। చూపులనడుమను వ్యా పించివెలిగేటి ఆపోజ్యోతినిజూపి ఆనందపరతురట ॥ మట ॥ ధరలోను వీపూరి పురము। మటముందు స్వయంబ్రహ్మానందగురుడు। అరసు రేమి యులేక ఆత్మసంధానంబు గురిజూపిభక్తులకు పరుడై ప్రకాశించె॥ మట॥ సాధనరహితమైనట్టి। ముఖ్యసాధనంబిదియని వొప్పి,। బాధయేమియు లేని ద్వాదశిబోధించగనియు మహాలక్ష్మమ్మ కైవల్యమును బొందె ॥ మ॥ కలి యుగమును జూడగాను। ఇదిమహాకైలాసమని చెప్పగాను। గనియు జే లింగగురు కల్వితాతత్వంబు। మలినరహితంబైన మహనీయులని జేసె ॥ మటమునకు ॥

౨౮ కీర్తన కన్నడరాగము ఏకతాళము.

యెంతో చెప్పినను వినవు శ్రీ కాంతూనిమనుస గనలేవు

పంతాబింకము లిడిలేవు మాయకాంతాలపొందు మరలేవు ॥ యెం ॥

తెనుష్ణపనులు జేయుచును నీవు తిన్నాదె మరిలిసుచును

అన్నిరుచులు గనుచును శ్రీరామన్నానామము గనవిను ॥ ఎం ॥
తిన్నా కన్నది సున్నగాదా ఈమన్నూర్లో చేరెతనువుగాదా
నన్నేచిన్నెలు మానరా యాపన్నాగశయనుఁగనరాదా ॥ ఎం ॥
వాదభేదము విడలేవా యీ సాదులపల్కుల్ వినరావా
మాధావయని యనలేవా ఛీఛీ రాధాలోలునిగను జీవా ॥ఎం॥
బుద్ధిలేని మాయజీవనా నీవద్దికి యముడు రాకపోవునా
సద్దివేడిలెస్స తినినా గాసెద్దాఖర్మాను లీడేరునా ॥ఎం॥
స్త్రీలాస్తనములుజూచి చాలా పూలబంతులబోలానుమేలా
ఫాలలోచనుగనవేలా యఖిలలోకాత్ములతోపొందదేలా ॥ఎం॥
రాసీపంతము సీకదేలా రామదాసూల నెరుగాని కూళా
దేశికులింగగురులీలా పుల్లాదాసమూఢుడగనవేలా ॥ఎం॥

౨౯ కీర్తన కన్నడ ఏకతాళము.

లోకంబులు పదునాలుగు గర్భంబునవిడుకొని। వివేకింపగభక్త
జనా హృదయంబున జొక్కని ॥లో॥ సాగరములునీలోనె యీభూత
ములునీలోనె ॥సా॥ వేగిరమునపరువిడు యాసూర్యచంద్రతారలునీవె
॥లో॥ తత్వదత్వంపదములకు పరములిచ్చెదీవెకా పరాత్పరాధ్యాన్నం
బు శేయ హరిపదము నీవెకా ॥లో॥ ఘటములోపలనుగల్గు మటము
లారునీవెకా మటములలోపడుచక్రవర్తివనగ నీవెకా ॥లో॥ వటప
త్రశయనుడావె యటవసించు టీవెకా మధుకైటంబుల ద్రుంచి సృష్టి
జేయుటీవెకా ॥ లో ॥ మునుల సురుల నరులకెల్ల వరములిచ్చుటీవెకా
మనమునదలచు లింగగురుడవైన నీవెకా ॥ లో ॥ వాసిగాను ఊడుజర్ల
వాసుడౌటనీవెకా దోసపాటి నాగదాసుని గాసిదీర్చునీవెకా ॥ లో ॥

౩౦ తత్వము ముఖారి అటతాళము.

పద్మనాభా నిన్నునేను ప్రస్తుతించెద కాళయుక్తికష్టము జనుల
కునష్టము॥ రామయ్య రామా ॥ క॥ శక్తిమయమునజగములెల్లను పిక్క
టిల్లగ మారిచేతను నొచ్చిరి భయమునజచ్చిరి ॥ రామయ్యరామా ॥
పూరపూరనుశక్తులెల్లను పూర్భటించియు సందును వడుపునభ్రమింగును
॥రా॥ భూమిమీదను దామదూములుముట్ట జెప్పజాలమెంతో ఉబద్రి

ము చచ్చుటచిత్రము ॥ రా ॥ చోరజనములు ధీరతనమున నేరమునకను
బందిపోటులు దోసిరిబాటలు గాసిరి। రా॥ తల్లిపిల్లలవిడచి జనులు తల్ల
డిల్లుచుకృష్ణకాలువబట్టిరి జోలెలుగట్టిరి ॥ రా ॥ వానలేకను మానవులు
వడిజెంది అన్నములేక మిన్నులగానరు భక్తిమానరు ॥ రా ॥ కమలసం
భవుడాదిగానిను కష్టములు ఎడబాపుదైవంబందురు మరిమరి విందురు ॥
రా ॥ కానమయ్య యిట్టితామసము మానికలు రెండేసి పావుకుయిచ్చిరి
బీదలు నొచ్చిరి ॥ రా ॥ యేలజేసితివయ్య యిట్టి జాలినొందక చాలముంచె
నుకాలము బ్రతుకాజాలము ॥ రా ॥ ధరణిలో శావల్యపురమున శిరు
లొసంగియు లింగాదాసునిగావరా ॥ భక్తుల బ్రోవరా ॥ రా ॥

౩౧ శుద్ధకాంభోజి ఆది

ఆడవారిని నమ్మరాదురా త్రిమూర్తులకైన చేడెలమర్మము
తెలియబోదురా ఆడవారిలో యేమి తెలియనివారలుందురు లేనిపోనిపా
డుగానీసంసారము ఈదలేనని గురుని జేరి నేడువానిమర్మము దెలసి యేమి
లేదంచిటకాండ్రమరిగి పోడిమెరుగని పెద్దలనునిందెలపాలుగ జేతురు॥ ఆ॥
వాస పల్కులు పల్కుచుందురురా చిరునవ్వుతోడ మరిది బావా మా
మాయందురురా వరసలు చెడనట్లు పగలు అన్నతండ్రి తమ్ముడనుచును
మురిపమురా రాత్రిళ్లు జరుగు నరకమందు ముందువారె అగ్నికంభమందు
గట్టి మరలజన్మమునకునేసి దుఃఖసుఖములనుభవింప ధరణిలో ఆడగాడి
దారా ॥ ఆ ॥ పతివ్రతవలెనుందురు చూడగరా మగనినితాము చా
టునదిట్టుచు నుందురురా హితవులోకుల కనుకూలముగాను నుండుటేను
గాక ఖ్యాతిగల్గినదాననను చు ఒప్పులుపరసతుల నెంచుచు సతతము శ్రీ
లింగగురుని మర్మమెరుగకున్న వారికి నరకమనుభవింపజేసు వెంకట సు
బ్బయదాసా వరదుడు ॥ ఆడ ॥

౩౨ కేదారగౌళ త్రిపుట.

మానవజన్మంబెత్తినందుకు మహాపుణ్యాత్ముల దెలియవలెరా
మానకసద్గురు మర్మము గనుగొని జ్ఞానాంబుధిలో మునుగవలెరా ॥ ప॥
ఆరుచక్రముల కాధారంబగు హంసనిరూపణ దెలియవలెరా అరమర
లేకను యిరవైఒక వెయ్యి ఆరునూరుహంస రయపలెరా ॥ మా ॥

అండపిండముల కాధారంబై దండిస్వరూపము దెలియవలెర । కుం డలినడుమను నుండుజ్యోతిని దండిగానుదర్శించవలెర ॥ మా ॥

రూపములన్నియు నిరూపములనిమది స్థాపనజేసుక ఆపవలెర చూ పులనడుమను వ్యాపించిన యాఆపోజ్యోతిని జూడవలెర ॥ మా ॥

కాటుకపక్షుల చూటిదెలసికొని మేటిశిఖరమున జేరవలెర ఆటలాడు పెనుబాములబట్టి చూటినిరూపణ దెలియవలెర ॥ మా ॥

దండిగ పోలూరు లక్ష్మంబగురు పాదపద్మములు నమ్మవలెర యండమూవులయంట ప్రపంచము నుండనేరదని తెలియవలెర ॥ మా ॥

నడిమీపల్లియు వెంకటనరసమ్మ నమ్మినభావము దెలియవలెర యెల్లలోకములు వెతకిచూచిన యెక్కువలేదని తెలియవలెర ॥ మా ॥

33 మారువ రాగం ఏకతాళము.

నారాయణయని తలచితె మధురము నాలుకపైమాకు । నారద మునులకు జీవనమైనది నామంబదిమాకు ॥ నారాయణ॥ అష్టాక్షరియా మంత్రముతోపల అనుభవమదిమాకు అష్టప్రకృతులను త్రుంచి వేయు టకు ఆయుధమదిమాకు ॥ నారా । సజ్జనసంగతి సర్వకాలమును సాధక మదిమాకు దుర్జనసంగతి దోసరహితమై దూరంబగుమాకు ॥ నారా ॥ ఆకలిదప్పికి అమృతసారమును అనుభవమదిమాకు అంతరాత్మను దెలసి దుర్గుణములణచుట యదిమాకు ॥ నారా ॥ తత్వమశాద మహావాక్య ముల తారకమదిమాకు తత్వదత్వంకద అశిపదములలో తనవయమది మాకు ॥ నారా ॥ వృత్తిదిబయలనే ద్వాదశాక్షరిని సత్యంబదిమాకు నిత్యము కాదనిషోడశాక్షరిని నిల్కడయదిమాకు ॥ నారా ॥ సత్యం బిదియని వీరయాక్షగురు సవరసమదిమాకు సత్యముగా గొల్ల ముత్య మాంబమది నిల్కడయగుమాకు ॥ నారా ॥

—♦ గురుశిష్య సంవాదము యాలలు ♦—

ప॥ ఎల్లాలోకా మల్లాయిట్లు తొల్లిజననమైనవిధము కల్లగాదు నాకు చె ల్పుము॥ ఓసద్గురుస్వామి మల్లిపంచబాధములాలాను ॥

ఉ॥ ధరజలపావక సమిరాంబరములు అయిదుగూడి జోకతో యీలోక మాయెరా । ఓహో చిన్నవాడా రాకపోక లిందుగలవురా॥

ప॥ అండా పిండా బ్రహ్మాండములు నిండియున్న బ్రహ్మమేదో దండి
గానునాకుదెల్పుము। ఓసద్గురుస్వామి కుండలీమధ్యమున జ్యోతిని॥
ఉ॥ నివారసూకాగ్రిమనే భావాముతోగూడి యాత్మఆవరించి అంతా
తానౌరా॥ ఓచిన్నవాడానిన్నునన్ను అన్నిదెల్పురా॥
ప॥ యెరుకాతాను యున్నానని యెన్నాడెరుగకున్నాదేదో మన్ననా
తోనాకుదెల్పుము॥ ఓసద్గురుస్వామి విన్నకన్నది సున్నజేయుమా॥
ఉ॥ చలికి యెండవానకెపుడు అలసటేమిలేకా బయలు రేపుమాపు
లేకయుందురా ఓవోచిన్నివాడా పలుకు భావమందబోదురా॥
ప॥ తెల్లవారే ఱుకజన్మాము కల్లాలా యెజగములెల్లా అల్లాపరిపూ
ర్ణమొకటేను॥ ఓసద్గురుస్వామి శ్రొల్లిలింగగురుని బోధచే॥
ఉ॥ దిట్టమూ గంజెల్లానుండా దాసూలేదు చూడాబోతె వేదభాష
లెందుబోయెరా॥ ఓవోశిష్యాళిలుకా కోటలేదు యీటుబోయెరా॥

యాలలు.

ప॥ నాదబిందుకళలదేరి మోదమలరుచున్నయాత్మా భేదమేదో పా
దుదెల్పుము॥ ఓసద్గురుస్వామి సాధనచతుష్టయములను॥
ఉ॥ సాదాన చతుష్టయములు చక్కగా గుర్తెరిగినపుడే । సమరస భా
ముగల్గురా ॥ ఓవోచిన్నవాడా చాలును యీక్రమము దెలియరా ॥
ప॥ కామాదిశత్రువుల బట్టెగాలమున్నాదనగా వింటి కామములుకడకు
దోచుటా॥ ఓసద్గురుస్వామి నీమముతో నాకు దెల్పుము॥
ఉ॥ కామాదిగుణములు లేవు కలసి గురునిచేరినపుడె ఖర్మబంధమూలు
దొలుగురా॥ ఓవోచిన్నవాడ కాంక్షలన్ని కాలిపోవురా॥
ప॥ సంసారతాపత్రిమనె హింసాలోను చిక్కిన్నాను హంసస్వామిజా
డదెల్పుము ఓసద్గురుస్వామి అంతాబ్రహ్మమైన చోటును॥
ఉ॥ అంతా బ్రహ్మమైనచోటా వింతాలేమిలేవుచూడా మంతనము
మానితెలియరా॥ ఓవోచిన్నవాడా అంతరాత్మలో నెకలయరా॥
ప॥ సూటిగాను బోధవాకు నాటున్నాది చూడగను మాటలేల బాట
దెల్పుము॥ ఓసద్గురుస్వామి దీటులేని చోటుజూపుమా॥
ఉ॥ దీటులేని చోటునీకు మాటలోనేచూసేదాను కాటుకపక్షులచేతను

ఓవో చిన్నివాడా చూటిదప్పకను చూడరా॥

ప॥ తానునేను అనేఎరుక తగిలున్నాదిచూడగను తానునేను లేని చోటును ఓసద్గురుస్వామి దానసేనాకును దెల్పుము॥

ఉ॥ నీవులేదు నేనులేదు। నిల్కడగురైగినపుడె నీవునేను లేనిచోటును ఓవో చిన్నవాడానిక్కము యిదిగోను చూడరా॥

ప॥ ఆదిమధ్యాంతములేక అంతాటబయలోకాటుండె ఇంతాలాడి యెరుకయేదోయి ఓసద్గురుస్వామి సంతోషమున నాకుదెల్పుము॥

ఉ॥ ఇంతలాడి యెరుకనిపుడె పంతమూన బట్టినేను పుట్టిముంచి దిట్ట పరచితి ఓచిన్నవాడా గుట్టునీకే తెల్పా బూనితి॥

ప॥ రాజులేదుమంత్రిలేదు రాకాపోకలు రెండులేవు జోకతోపరిపూర్ణ మందున ఓసద్గురుస్వామి మూలింగాగురుని బోధన॥

ఉ॥ గురువులేదు శిషువులేదు గుత్తిరామస్వామిలేదు నిక్కమునిజబోధ గల్గిన ఓశిష్యాతిలుకా నిన్ననే తెరదీసినప్పుడె॥

తత్వము నీలాంబరి పంతాళం.

మడి మడియనియెదవే ఓమనుసా మడియేదో మదిదెలియవే॥ మడియనుచును నీళ్ళమదుగులో మునగితె తడచి చలికొనుకును వైరాగ్యమబ్బున యేడుకొండలనట్టనడుమను యేరుదాటియెరుకమరచి మూడుమూలల మేడలోపల జాడగట్టినదదియె మడియగు॥మడి॥ ఇళ్ళాయమ్మడిడిరుగుచు పిద్దలనెల్లా ఫెళ్ళుఫెళ్ళునదిట్టుచుకాళ్ళుపదిమారులుకడిగిన మడిగాదు వ్రేళ్ళువరచిచాలవెతజెందుటకాని నాళ్ళనడుమనునడిమి గుడిలో నాదుబిందుకళలనెరిగి మళ్ళిజన్మంబునకు రానిమార్గములుగట్టింది మడియగు॥మడి॥ నిప్పు నీళ్ళుగడుగుచు దూరాచారతిప్పలుబడిచెడకె చెప్పేదేమిటికె నీజననీగర్భమునం దెడలెనుశుక్ల శోణితమని సేవింపగచెప్పరారాని ద్వారమందునచేరిపుట్టుచుగిట్టుచును నీతప్పదెలియక రెండు కన్నులు గప్పుకొనితిరిగేవె మనుసా॥మడి॥ అంటరానినీచులో ఓమనుసా తంటాలుబడిచెడకె అంటులో బుట్టిన మంటికుండను దెచ్చి అంటాదోమితె దానియాకారము దీరునా కొంటెచేష్టలుమానినీవునుంటివా నీలోన నుండేదింటివా వేదాంతవాక్యము కంటివా ఓమెర్రిమనుసా॥

మడి ॥ మయలాని మొరిగేదవే ఓమనుసా మయలేదోమదిగనవే మయ లేకానిసీలో మంచివస్తువయేదో దయసేయు నాతోటి తేటతెల్లముగాను నియతితోడుతర క్తమాంసము సన్నమెముకలు బొద్దబొనికలు తోలుగ ప్పుకలోననుంటివి దోవదప్పినదొంగవలెను॥ మడి॥ ఆశాలు నెరసమ్మకే ఓమనుసా యాశించిదుఃఖంచకే ఈమంత్రము లు మెందుకొచ్చనోగాని కాసుకునొరగావు కష్టపడుటెకాని భాసురంబుగగుత్తిరామయ దాసు రాలైహృదయమందున జేసినతత్వంబు మహిమని చేరిఆనందించుమను సా ॥ మడి ॥

తత్వము. మారువ ఏకతాళం

జెపధమిదుగొ కొనండి గొప్ప దోషగుణములు కుదురునండి దేశములోలేనిది దేశికుడు దెచ్చినది హాసిగద్వాదశాద్వైతులు నూరి నది ॥ ఔ ॥ గలవు పదిరెండుమాత్రిలు తింటె మలినకల్మషరోగాలు పాలుబోకకుదురును తెలివంది తిరుగును ఫలితమాగట్టిగ పత్యంబులుం చేను ॥ ఔ॥ ఏనుగ శునకము తినవలెను దాని జతపందిని తినవలెను మానుగ త్రివిధప్రసాధములా మాంసమును తిని దేశికునివలన పత్యముం డగవలెను ॥ఔ॥ ఆరుగురిమాంసం భోంచేయండి చేరిపదిదున్నలనునర కండి బేరములేనిది బుధులు సమ్మతమనేది క్షీరాన్నములోమీారు కలిపి భుజించండి॥ ఔ॥ నూాడుకుక్కలను తినండి ఇంకా యేకునక్కల గాజే యండి మరాడుయేరులనమమ చేరియుండినకనమ గూఢములోకోతి కూ నరముందేతినుడి ॥ ఔ ॥ అందారుతినవచ్చునండి మనమందబుద్ధులుపో వునండి మొసకువ్యర్థము అందరుతినలేరు ముందుగ శ్రీలింగదేశికులు తిన్నారు ॥ ఔ ॥

మంగళహారతి.

రాజయోగమునందు రంజిల్లుచునుమహా రాజులుగాయున్నట్టి రతుకునకూ శ్రీగార్థచరుమార్థ యోగంబులకును సంయోగమందిన భోరిభూషణునకు ॥ జయమంగళం॥ మహోత్సవమంగళం జయాజయ మంగళం నిత్యశుభమంగళం ॥ బాగుమీారగ బ్రహ్మ యోగసమాధి లో త్యాగిగాయున్నట్టి దేశికునకు రాగద్వేషములన్ని రద్దుపరచియుపర

మభావమొందినయట్టి బ్రహ్మమునకు ॥జయ॥ రాకడా పోకడాలేకను యేప్రాక్రు ప్రాకారమైయున్న ప్రభువునకును జోకతోడుతమాయజోలి తానెరుగని శ్రీకరంబగు సీతారాములకును ॥జయ॥ సారంబులేని సంసారాబ్ధిదాటింప నేరుపుగలయట్టి నేతృనకు సాకారగుణములను సవరించిపరతత్వ భావమందినయట్టి పరబ్రహ్మమునకు ॥జయ॥ పంచభూతములైన ప్రపంచమంతయు సంచితంబులుయనే సరణిదెలసి పంచవింశతితత్వ భావమతీతమై వంచనాలేకున్న వరగురునకు ॥ జయ ॥ సృష్టిలోశావల్యపురమందువిలసిల్లు దిట్టయగు గనులక్ష్మిదేవాంబకు అష్టాంగయోగంబు లాంత్యముపదేశించు శ్రేష్టమగు మాలింగ గురునికిపుడు ॥ జయాజయమంగళం ॥ ఇత్యకీర్తనలు ముగిసెను.

ఇట్లువిధేయుడు యర్రంశెట్టి పుల్లాదాసుడు.

వినుకొండతాలూకా అగ్నిగుండాల శివారు వూడుజర్ల గ్రామం.

---

## ఉపదేశపంచీకరణినిచారణ.

శ్రీ జవ్వాదుల లింగాయోగిగారు శిష్యులగు యర్రంశెట్టిపుల్లాదాసునికిచెల్పిన అక్షరములవిమర్శ.

| | | |
|---|---|---|
| 1 ఓం | ఏకాక్షరి | 1 |
| 2 రామా | ద్వితీయాక్షరి | 2 |
| 3 శ్రీరామా | తృతీయాక్షరి | 3 |
| 4 నారాయణ | చతురాక్షరి | 4 |
| 5 నమశ్శివాయ | పంచాక్షరి | 5 |
| 6 ఓనమశ్శివాయ | షడాక్షరి | 6 |
| 7 నమోనారాయణాయ | సప్తాక్షరి | 7 |
| 8 ఓనమోనారాయణాయ | అష్టాక్షరి | 8 |
| 9 ఓనమోనారాయణాయణ | నవాక్షరి | 9 |
| 10 ఓనమోనారాయణాయణమః | దశాక్షరి | 10 |
| 11 క్లీదంతె పుండరీకాక్షాయనమః | ఏకాదశాక్షరి | 11 |

యీ అక్షరములు గురుముఖాలముగా తెలిసికొన్న మొదల సాలోక్యం

సామీప్యం సారూప్యం సాయుజ్యం అనుహాసిపదంబుగలుగును.

ప్ర॥ ఉపదేశమనగాయేమి?

ఉ॥ వత్సా! మాగురుస్వాములవారు పూదోట శేషావధూతగారివల్ల నున్ను ఇంకాకొంతమంది ఆర్యులవల్ల విన్నంతనున్ను,
ఈపద్యముద్వారా దృష్టపరిచెదవినుడి.

సీ॥ కావునసద్గురుపాదకంజాతములుసేవించి వారిచేనుపదేశవర్తియగుచు
త్రివిధదీక్షలుబొందిభవములన్నియుగుంది త్రివిధలక్ష్యార్థముల్ తెలియజూచి
త్రివిధవర్ణంబులు వివిధమంతయుదెలసి త్రివిధక్రియలనుమదిదిప్పునివక
త్రివిధ ప్రసాదముల్ స్థిరమతిభుజియించి త్రివిధమూత్రాచారమవిరళముగ
తే॥ తెలియకున్నను అద్వైత దివ్యసుఖము । గలుగనేరదునిత్యాత్మగనగ
లేరు। అనుచుఆర్యులు బల్కిరి అద్భుతముగ । వినుడి యిదినిజమని
వెలయుడివినుతులార॥

గనుక యీపద్యము అర్థము అనుభవముగా జూపించెదను.
యిప్పుడు ఉపదేశక్రమము చెప్పెను.

ఉ॥ పుత్రులారా! ఈలోకంబున మానవజాతంబులుకడతేర గలందులకై సర్వసృష్టి నిర్ణయంబులతోపాటు సుజ్ఞాన వేదశాస్త్రంబులు నిర్ణయింపబడియుండెను. గనుక అది కొందరు చదువుకుంటూ ఈలాగునవస్తూవుండె వుభయజనాదులకు జ్ఞానముగలిగి మోక్షాపేక్షకు యుద్యుక్తులై సర్వంబెరింగినసద్గురు స్వామినింగని మోక్షమార్గము చెప్పుమని అడుగగ విని గురుస్వామి ముందర తగునడువడిచెప్పెను ఆప్రకారంశిష్యుడు గురుపాదాభిషేకంబులు సమర్పించి ద్వాదశ వందనంబులుజేసి లేచి గురుస్వామికి అభిముఖుండై ముకిలితహస్తుడై స్వామి ఇకనాగతియేమని అడుగగ విని గురుస్వామియిట్లనియె. ఓయిశిష్యుడా నీగతి నిర్గతిజేసెద అదియెట్లంటివేని ఈలోకఖర్మఖాండ చదువుకు నాలుగు అంతస్తులుగలవు అవియేవంటె ఓనమాలుదిద్దుట గుణితము పెట్టుట అర్థంబెరిగి పాలించుట ఇవినాలుగు మెట్లాగోఅట్లాగె వేదాంతమార్గమునకుకూడానాలుగు మెట్లుగలవు అవియేవంటె తారకమును చెప్పుట సాంఖ్యవృద్ధిని విచారించుట

సాంఖ్యలయంబై నిలచినతత్వంబై అమనస్కంబును నెరుంగుట ఆపైన పరిపూర్ణంబు నెరింగి ఎరుకపంచబంధంబులు తెంచుట ఇది జన్మాంతరరహితంబుగనుక తారకలక్షణం బేమంటె.

ప్ర॥ స్వామి ఆతారకలక్షణంబు దయచేసి నన్ను కృతార్థుని జేయగోరెద.

ఉ॥ నేనైన గురుస్వామిని కుడిహస్తంబు నీశిరంబునబెట్టుట నీఫాలంబున ధాతవ్రాంతకు మార్పు విభూతిరేఖలుమూడుదిద్దుట నీకుడిచెవులో తారకమంత్ర వుపదేశంబు చెప్పుట. నీకంట్లో తారకబింబమైనవెలుంగు నిదరశనం చేయించుకుంటివి. అంతట ఖేచరి భూచరి మధ్యమి షణ్ముఖి శాంభవి అను ఈ అయిదుముద్రిలలో రాజాశ్రమమునకు తగిన షణ్ముఖి ముద్రను పట్టుతు లోగ ప్తిచేత పైదృష్టితో నీశిరంబులో ఆకాశధ్వని వింటివి ఈప్రకారము పట్టిచెప్పి ఆస్తానంబునలేచి పద్మాసనమున కూర్చుండి ప్రతిరోజున్ను గడియపెట్టింపుగా ఆశబ్దమునందు గురిపెట్టి సోధనచేస్తూరాగా కొన్నిదినంబులకు క్షిణీనాదంబును మరికొన్ని దినంబులకు క్షిణిక్షిణీనాదంబును ఆవల కొన్ని దినంబులకు మేఘనాదంబును అటుతర్వాత కొన్నిదినంబులకు భేరీనాదంబునుఆవలకొన్నిదినంబులకుమృదంగానాదంబును ఆప్రకారం కొన్నిదినంబులకు తాళ్యానాదంబును ఆవెనుక కొన్నిదినంబులకు శంఖానాదంబును అటుతర్వాత కొన్నిదినంబులకు ఘంటానాదంబును తక్కినకొన్నిదినంబులకు వేణీనాదంబును పిమ్మట కొన్నిదినంబులకు వేణూనాదంబును ఇట్లు దశవిధప్రణవనాదంబులు యేకమై ఒక్క ఓంకారమై పలుకువరకు సాధించుటే యిది అంతా ఒక్క తారకంబనబడును. ఇదే ఓంమిత్యేకాక్షరంబనే ప్రణవము ఇదే సోహం హంసోహం దాసోహం అను అనుభవము. ఇదిరేచికము పూరకముపీటిచేత హంసనునడుపుతున్నశరీరములోనె ఈనాదమును వినవచ్చును ఇదేతారకము యికను సాంఖ్యవృద్ధిని చెప్పెదవినుము.

ప్ర॥ అయ్యా! ఆసాంఖ్యవృద్ధిని చెప్పి నన్ను కడతేర్చుడి.

ఉ॥ ఓంకారమనె ఆకాశంబును ఆ యాకాశంబు పంచభూతంబులాయెను. అదియెట్లంటె. జ్ఞాత, మనసు, బుద్ధి, చిత్తము, హంకారము

ఇవి అయిదున్ను ఆకాశపంచకంబైన అంతరింద్రియములు ఈఅంతరింద్రియములవలన బుట్టిన వాయుపంచకం బేమంటే; సమాన, వ్యాన, ఉదాన, ప్రాణ, అపాన, ఈఐదున్ను వాయుపంచకంబులైన పంచప్రాణంబులు. వీటివలన బుట్టిన అగ్నిపంచకం బేమంటె; శ్రోత్ర, త్వక్కు, చక్షు, జింహ్వా ఘ్రాణ, ఈఅయిదున్ను అగ్నిపంచకంబైన జ్ఞానేంద్రియములు. వీటివలనబుట్టిన జలపంచకంబేమంటె; శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము, ఈఅయిదున్ను జలపంచకంబైనవిషయేంద్రియములు. వీటివలనబుట్టిన పృధివిపంచకంబేమంటె; వాక్కు, పాణి, పాదా, వాయువు, వుపస్థ ఈఅయిదున్ను పృధివిపంచకంబైన కర్మేంద్రియములు అయిదైదులు యిరవైయైదు తత్వాంబులాయెను. అందులో మొదటిఅయిదుగూడి స్థూలదేహమాయెను. కడమ యిరవైయింటిలో పదియేనుగూడి సూక్ష్మదేహమాయెను. కడమ మూడుకూడి కారణదేహమాయెను ఈమూడు దేహములునుగూడి నీపాదాది మస్తకపర్యంతంబున యిరువైయైదు స్థానాలుగద్దు యిరువైయైదు స్థానాలయందు యిరువైఐదు తత్వంబులుండును. ఇకవాటివాటివృత్తులు యేమంటె;

జ్ఞాత॥ సహస్రారమందుండి సకలపనులకు జ్ఞప్తిజేస్తూవున్నది.

మనస్సు॥ కంఠస్థానమందుండి నానాప్రియాణములకువూహచేస్తువున్నది

బుద్ధి॥ ముఖస్థానమునందుండి సకలకోరికలు కోరిస్తువున్నది.

చిత్తము॥ నాభిస్థానమునందుండి నానాచింతలు చేస్తువున్నది.

హంకారము॥ హృదయమందుండి హంచేస్తున్నది. యిక్కడికిఆకాశపంచకంబైన అంతరింద్రియముల అయిదింటిపనులు ముగిసెను.

సమానవాయు॥ నాభిస్థానమందుండి దక్షిణజేసిన చతుర్విధపదార్థముల రసమును డెబ్బదిరెండువేలనాడులకు సమముగాపంచిపెడుతువున్నది

వ్యానవాయువు॥ శరీరమంతట వ్యాపించి రోమంబులుగగ్గురించి శీతోష్ణస్పర్శలను యెరుక పరుస్తువున్నది.

వుదానవాయువు॥ మెరుపు తీగెవరణముకలిగి కంఠస్థానమందుండి విచిత్రములైన లౌకిక వైదిక వాఖ్యములను పలికింపజేయుచూ సుషుప్తియావస్థయందుండి యింద్రియములన్నిటిని తీసికొనిపోయి అవిద్య

లోగల్పుచు జాగ్రితఅవస్తయందు వాటివాటిగోళాకారములకు పంపిస్తువున్నది.

ప్రాణవాయు॥ వక్షస్తళముందుండి నీవువినిన తారకధ్వని వెన్నుకొయ్య నడినాళ్ళరంధ్రింబెక్కి హాం క్షం అనే రెండు బీజంబులనుబట్టి ఇడా పింగళా యనేకుడి యడ రెాడుముక్కు రంధ్రములగుండా సో. వెలుపలికి హాం. లోపలికి ఉశ్వాస నిశ్వాసముల నడుపుతూవున్నది.

అపానవాయు॥ గర్భముందుండి మలబద్ధకము శరీరమునకు అంటకుండా తుడిచివేసి అధోశేషమై వెళ్ళిపోతూవున్నది. యిక్కడికి వాయు పంచకంబైన అయిదింటిపనులు ముగిసెను.

శ్రోత్రేంద్రియము॥ కర్ణగోళకములయందుండి దిక్కులు శబ్దములను వింటూవున్నది.

త్వగేంద్రియము॥ చర్మమందుండి శుక్ల, మజ్జ, మెదస్సు, హస్తి,నరములు మాంసము, రుధిరము, సప్తధాతువులను పొదపెట్టుకొని ముసుకువతుగా చర్మము కప్పియున్నది.

చక్షురేంద్రియం॥ కన్నులయందుండి నానావిధరూపములను వీక్షిస్తువున్నది.

జిహేంద్రియం॥ నాలుకయందుండిషడ్రసములయొక్క రుచులను గ్రహిస్తువున్నది.

ఘ్రాణే॥ నాశికములయందుండి త్రివిధగంధములను ఆఘ్రాణిస్తువున్నది.

శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము ఇవిఅయిదు అర్థం బయలుగావున్నదిగనుక వ్రాయలేదు.

వాగేంద్రి॥ వక్త్రిమందుభాషించిపుణ్యముదూషించి పాపంచేస్తువున్నది

పాణే॥ హస్తములయందుండిపెట్టించిపుణ్యముకొట్టించిపాపంచేస్తువున్నది

పాదేంద్రియం॥ పాదముల యందుండి పుణ్యక్షేత్రములకు నడపించి పుణ్యము పాపక్షేత్రములకు నడిపించి పాపముచేస్తువున్నది.

పాయురేంద్రియం॥ గుదస్థానమునందుండి యేపూట మలమును ఆపూట వెళ్ళతోస్తూవున్నది.

వుపస్తేంద్రియం॥ యోని ప్రజాపతులయందుండి మూత్రమువిసర్జనజేస్తు

స్త్రీ పురుషులకుగమనములు గలుగజేస్తు శుక్లశోణితములకు కారణభూతమైయున్నది యిక్కడికి పృథివిపంచకంబైన కర్మేంద్రియములు అయిదింటపనులు ముగిసెను.

యికను సాంఖ్యలయంబై నిలచిన తత్వంబైన అమనస్కమును చెప్పేము మనోబుద్ధి చిత్తహంకారములు నాలుగున్ను జ్ఞాతలో బుట్టినవిగనుక జ్ఞాతయందేచేరును. వ్యాన, వుదాన, ప్రాణ అపానములు నాలుగున్ను సమానవాయువలో పుట్టినవిగనుక సమానవాయువులోనే చేరును. త్వక్కు, చక్షు,జింహ్వ, ఘ్రాణములు నాలుగున్ను శ్రోత్రేంద్రియములో బుట్టినవిగనుక శ్రోత్రేంద్రియమందేచేరును. స్పర్శరూపరసగంధంబులు నాలుగున్ను శబ్దేంద్రియములో బుట్టినవిగనుక శబ్దేంద్రియమందేచేరును. పాణి, పాదపాయువుపస్త యివినాల్గున్ను వాగేంద్రియమందు బుట్టినవిగనుక వాగేంద్రియమందేచేరును. చేరగా మొదటి అయిదు పంచభూతంబులేనిలిచెను. ఆపంచభూతంబులు పంచబాధంబులు పరిష్కరించుటకు మొదటతారకమును గురించిచెప్పిన మంత్రములుగాక పరిపూర్ణమును గురించి ద్వాదశాక్షరిఒకటిన్ని, ఎరుకను విడిపించే షోడశాక్షరిఒకటిన్ని, కలతోసరియైనపంచదశాక్షరి ఒకటిన్ని ఈమంత్రములు మంత్రార్ధములతో వెరుకజననమరణములను దీసివేస్తామోయి శిష్యుడా॥

ప్ర॥ స్వామీ! షడ్వర్గములారున్ను రాగద్వేషములలో కలసి పదమూడైనవ లేక వేరుగాఅయినవ.

ఉ॥ బిడ్డలారా! అరిషడ్వర్గములతో కలసియే పదమూడు గుణంబులు అయినవి గనుక యీపదమూడు గుణములు విడువవలెను. అదెట్లనినా వీటివలన పదముగ్గురు నశించిరి. చెప్పెదను వారుయవరనగా రాగము పరస్త్రీగమనము జేయవలెననుచి త్తవృత్తి రాగంబనబడును. యిందుకుసాక్షి రావణుండు యిందువలన నశించెను. ద్వేషము తనకు ఉపకారముచేసిన ప్రతిఅపకారము చేయవలెననే చిత్తవృత్తి ద్వేష మనంబడును. దీనివలన హిరణ్యుండునశించెను. యికను కామము గృహగ్రామక్షేత్ర ధనధాన్యములు మిక్కిలి సంపాదించ

వలయుననేచిత్తవృత్తి కామంబనబడునుసాక్షినరకాసురుడునశించెను

క్రోధము॥ స్వార్జిత ధనాపహరణ మెవరిచేత జేయబడునో వానియం దాగ్రహముగల్గెడి మనోవ్యాపారము క్రోధమనంబడును: యిందుకుసాక్షి బకాసురుడునశించెను.

లోభము॥ తానుఆర్జించిన ద్రవ్యములో నొకకాసైనను యివ్వననే చిత్తవృత్తి లోభమనంబడును. యిందుకుసాక్షి దుర్యోధనుడు.

మోహము। తానుసంపాదించిన పదార్థమందు నతిప్రీతిగానుండు చిత్తవృత్తి మోహమనంబడును. ఇందుకుసాక్షిదశరథమహారాజునశించెను.

మదము॥ అయిశ్వర్యమువలన గర్వించి కృత్యాకృత్యముల దెలియక నడుచుచిత్తవృత్తి మదమనంబడును. యిందుకుసాక్షి కార్తవీర్యార్జునుడు నశించెను.

మాత్సర్యము॥ తనకంటె యితరులు హెచ్చుగానున్న వానినింజూచి వోర్వలేనిచిత్తవృత్తి మాత్సర్యమనంబడును. యిందుకుసాక్షి శిశుపాలదంతవక్త్రులు నశించిరి.

ఈర్ష్య॥ తనకుసంభవించినదుఃఖముయితరులకుగలుగవలయుననేచిత్తవృత్తి ఈర్ష్యమనంబడును. ఇందుకుసాక్షి అరుణాఖ్యుడునశించెను.

అసూయ॥ తనకుగల్గినసుఖములు ఇతరులకు రాకూడదనే చిత్తవృత్తిఅసూయ యనంబడును. ఇందుకుసాక్షి పౌండ్రికవాసుదేవుడు నశించెను.

డంబము॥ తానుజేసినపుణ్యములను పరులుజూచి బాగాయున్నదనేటట్టు స్తుతించవలయుననే చిత్తవృత్తి డంభమనంబడును ఇందుకుసాక్షి అంబరీషుడునశించెను.

దర్పము॥ తానేపెద్దయునిన్ని తనకు సమంబెవ్వరులేడనెచిత్తవృత్తిదర్పమనంబడును. ఇందుకుసాక్షి శతకంఠరావణుండు నశించెను.

అహంకారము॥ ఏమిరా వన్ను తెలియదా నేబట్టినకార్యము విడుతునా నీవా నాకు బుద్ధిచెప్పేవాడవనే చిత్తవృత్తి అహంకారమనబడును. ఇందుకుసాక్షి మధుకైటభులు నశించిరి గనుక సకలసంసారభవబంధములకున్ను హేతువుగా నున్నందున ముముక్షువులు మొదలైనవారలును యీపదమూడు గుణములను విడువవలెను.

## ఆ ధా ర ము.

ప్రి॥ శ్రీగురుస్వామి! షడాధారముల వివరమును అందుండె అధి దేవతలను హంసపంపిణిన్ని దృశముగా చెల్పగోరెదము.

ఉ॥ సుహృదులారా! ఆధారచక్రము గుదస్తానమున నాలుగుదళములచే వ శ. ష. స యీ నాలుగుస్వరూపములు గలిగి ఓం అను బీజాక్షరము అర్ధచంద్రాకారం పీతవర్ణం కుంకుమకాంతి కింకిణీ నాదం క్రియాశక్తి భూలోకము ఆరునూర్లు హంసలయించును అధి దేవవిఘ్నేశ్వరుడు. స్వా ధి ష్ట ము.

స్వాధిష్టానం, ప్రజాపతిస్తానం ఆరుదళములచే బ భ మ.య ర.ల. తయారుస్వరూపములచే న. అను బీజాక్షరముగల స్వాధిష్టచక్రం త్రికోణకృతి. శ్వేతవర్ణం, మెరుపుకాంతి, వీణానాధం, జ్ఞానశక్తి; భువర్లోకము. ఆరువేలహంసఅర్పణం అధి దేవత బ్రహ్మ.

## మ ణి పూ ర క ము.

మణిపూరకము నాభిస్థానము పదిదళములచే డ. ఢ. ణ.త. థ; ద; ధ. న. ప. ఫ. ఈ పదిస్వరూపములుగలిగి మ. అను బీజాక్షరము గల ఆరుకోణములుగలచక్రము ఆకుపచ్చవర్ణము, రక్తకాంతి, వేణు నాథం, ఇచ్ఛాశక్తి సువర్లోకం ఆరువేలహంసఅర్పణము, అధిదేతా విష్ణువు. అ నా హ త ము

అనహాత వక్షస్తానమున పండ్రెండుదళములచే అనహాతకమలం క, ఖ గ. ఘ. ఙ. చ. ఛ. జ. ఝ. ఞ. ట. ఠ. ఈపండ్రెండుస్వరూపములుగలిగి సీ. అనుబీజాక్షరములచే గుండ్రాకారము. నీలవర్ణము, శాంతకుంభపుకాంతి, శంకుఘోష, ఆదిశక్తి, మహర్లోకము, ఆరువేల హంస అర్పణము అధి దేవత ఈశ్వరుడు. వి శు ద్ధ ము.

విశుద్ధము కంఠస్తానము పదియారు దళములుగలిగి అ.ఆ.ఇ.ఈ. ఉ.ఊ. ఋ. ౠ. ఌ. ౡ. ఎ. ఏ. ఐ. ఒ. ఓ. ఔ. అం. అః. అను పదియారుదళములుగలిగివ. బీజాక్షలముచే విశుద్ధకమలమునందు ధూమ్రవర్ణము, మేఘానాదము, షోడశాస్వరములు, పరాశక్తి, జనర్లోకము; వెయ్యిహంస అర్పణ అధిదేవత సదాశివుడు. ఆజ్ఞేయం.

ఆజ్ఞేయంత్రికూటస్థానం రెండుదళములు:గలిగి హం. క్షం. ఈ రెండువర్ణములుగలిగి య. బీజాక్షరములుగల ఆజ్ఞేయచక్రమునందు సర్వవర్ణములుగలిగి సముద్రఘోష భృామధ్యమాణిక్య కాంతిచే గంగ యమున సరస్వతి సంగమస్థానం తపోలోకం ఆత్మకు వెయ్యిహంసఅర్పణగలగి అధి దేవతాపరమాత్మస్వరూపుడు.

సహస్రారము.

సహస్రారముఫాలభాగమున వేయిదళములుగలిగి రాం బీజము గలిగి సహస్రారకమలమునందు చిత్రవర్ణము, ఝూంకారనాధం, సత్య సత్యలోకం వేయిహంస అర్పణములు అధి దేవయ సద్గురుస్వామి.

ప్ర॥ ఆర్యస్వామి! పదునాలుగులోకములని శెలవిచ్చితిరి అవియేవో తెల్పిమమ్ము కృతార్థులుగా జేయగోరెదము.

ఉ॥ శిష్యచూడామణులారా!

ఊర్ధ్వలోకములు

1 భూలోకం గుదమందు
2 భువర్లోకం గుహ్యామందు
3 సువర్లోకం నాభియందు
4 మహర్లోకం హృదయమందు
5 జనలోకం కంఠమందు
6 తపోలోకం భృామధ్యమందు
7 సత్యలోకం లలాటమందు

అధోలోకములు.

1 అతల అరికాళ్లయందు
2 వితల మీగాళ్లయందు
3 సుతల మడిమలందు
4 తలాతల పిక్కలయందు
5 రసాతల మోకాళ్ళయందు
6 మహాతల తొడలయందు
7 పాతాళ్ళ గుదమందు

సప్తద్వీపములు

జంబుద్వీపము తలలోను
పక్షద్వీపం అస్తులు
శాఖద్వీపం శిరస్సున
శాల్మలీద్వీపం చర్మను
పుష్కరద్వీపం గోళ్ళయందు
కుశద్వీపం మాంసమందు
క్రౌంచద్వీపం వెంట్రుకలందు

## సప్తసముద్రములు

లవణసముద్రం మూత్రం　　దధిసముద్రం శ్లేష్మం
ఇక్షుసముద్రం చెమట　　క్షీరసముద్రం పాల్లు
సురసముద్రం యింద్రియం　　సుద్ధోదకసముద్రం కన్నీరు
సర్పసముద్రం శోణితము.

ప్ర॥ శ్రీగురువర్య పంచముద్రలనియు యమనియమప్రాణాయప్రత్యాగాయ ధారణ అష్టాంగయోగములనియు చెప్పినారు అందుగలుగు ఫలితమెద్దియో తెలవిడుడు.

శ్రీసద్గురుడిట్లు జెప్పుచున్నాడు.

ఉ॥ నేను యిదివరలో బోధించిన అమనస్క-బోధలో ప్రచురించబడి యుండెను అయినను వినుడు! గుర్రములవలెపరుగెత్తుయింద్రియములు మట్టుపరచ గలందులకు యోగభ్యాసము కావలసియున్నది అది యెట్లన్న నాగస్వరమునూది సర్పమును బట్టినట్టున్ను మచ్చుజల్లి పక్షిని బట్టినట్టున్ను, మాంసము వేసి డేగను బట్టినట్లున్ను, యెర్రను వేసి చేపను బట్టినట్లున్ను ఈముద్రలవలన సాధనములవలనమనసునిల్వగలందులకు సాధనములు గానివిదేహాకైవల్యమును చిక్కదు.

అయినప్పటికిపంచముద్రల వివరము తేటపర్చెదను

ఖేచరి॥ ఖేచరియనగా గురువువలన పంచాక్షరిమంత్రమును ఆమంత్రార్థములైన పరశివా లోకనమును జేస్తు పద్మాసనంబున గూర్చుండినదు మునిక్కి ముఖమెత్తి నేత్రములను మూసికొని త్రికూటస్థానమునందు దృష్టినిల్పి పాలమునజూచుచుండిన అంతరిఖేచరియనబడును నేత్రములను తెరచి యీవిధముగానే వారచూపు అరగంటినచూచిన ఖేచరియనబడును.

భూచరి॥ సద్గురుజెప్పినప్రకారంగా గూర్చుండి యర్థార్థమిలత లోచనుండై నాశికమధ్యభాగమును దృష్టినిల్పి నిటలమునుజూచినట్లైన నది మధ్యమముద్రయని చెప్పబడును.

షణ్ముఖి॥ అనగా సద్గురుచెప్పిన ప్రకారం పద్మాసనపరుండై శ్రవణద్వయంబును నాశికద్వయంబును నేత్రద్వయంబుతుత్రివేణికూట స్థా

నంబునదిృష్టినిల్పి దశవిధప్రణవనాదంబులు నొక్క ఓంకారము వ
రకు వినబడుట అదిఅంతా ఒక్కతారకంబైన షణ్ముఖి యనబడును.
ఇదియే గృహస్థాశ్రమమునకుముఖ్యమైనది

శాంభవి॥ ముద్ర అనగా ఎడమకాలిమడిమను గుదస్థానమునందుజేర్చి
కుడికాలిమడిమను తొడపిక్కసందులోనుంచుకొని తొడల యందు
చేతులు గూర్చుకొని నడుము నిక్కించి ప్రాణాది వాయువుల నిరో
ధింపంగలుగజేసి హంసను సహస్రారకమలమందు ఈశ్వరాయిఖ్య
ముచేయుటే చే తన్మయము జెందుటే శాంభవి ముద్రయనబడును.

మధ్యమి॥ ముద్రను నాసికకొనయందు దిృష్టినిల్పి గడియచూడగా ఒక
నిలమువతుగాజ్యోతి దర్శనమిచ్చును ఇదియేమధ్యమి. పంచముద్ర
లవివగము అయినది, ఇక నేమో అడుగుము చెల్పెద.

ప్ర॥ శ్రీసద్గురుస్వామీ! మోక్షమునకు గావలసిన సాధనములేవో దయ
చేయ ప్రార్థిస్తూయున్నాము.

ఉ॥ విచారణవిషయమై అనేకసూత్రములు అనేకసాదనలు అనేక పద్ధ
తులుగాయుండియున్నది, తేలినఫలితము ఒక్కటిగాయుండియున్నది
కాబట్టి విచారించుటకు ప్రొద్దులేదు ముఖ్యముగా తెల్పే పదార్థము
యేమనగా.

ప్ర॥ ఆచార్యస్వామి! అందుకు ముఖ్యపదార్థ మేమి.

ఉ॥ చెప్పెద వినుడు రుగ్వేద, యజుర్వేద, సామవేద, అధర్వణ వేదము
లు నాలుగున్ను ఉపరినాలుగున్ను స్పష్టముగా బోధింపుచున్నవి
యెట్లనిన ప్రజ్ఞానబ్రహ్మమని రుగ్వేద మహావాక్యము. ప్ర అని
ప్రకృతి అనగా మాయ మాయ యనగా హంకారము హంకా
రమనగా తెలిసికొనేదిన్ని కనుపించేప్రపంచము సత్యమనితోచుట
యును అంతర్భావ్యములుమనోగోచరములైన యదృశ్యంతన్నస్వం
యతీకృతం తదీనిశ్చయమని న్యాయమున్నది. గనుక ఈకనుపించు
వాక్కునం చెప్పబడు సర్వమును ఆత్మాయవియును అజ్ఞానమును
విడిచి ఒక్క గురువాక్యమునందే ఏకచిత్తముగానిలిచినది జ్ఞానమ
నియు ఆత్మాయనియును ఈరెంటిని తెలిసికొన్న దానే బ్రహ్మమని

రుగ్వేదమహావాఖ్యము పల్కుచున్నది. ఇంతటిభావము తెలిసి కొన్నదే గురుదీక్ష.

అహంబ్రహ్మాస్మియను యజుర్వేద మహావాఖ్యం అకార వుకార మకారములను మూడువర్ణములుకూడినదే ప్రణవమనియును శబ్దదృష్టి సంకల్పములను సద్గురుడు చెప్పిన స్తానమందు నైక్యముచే యుటయే యోగమనియును అకారమైన యర్ధమాత్రుక ఆధారచక్రమందు బుట్టి పరాపశ్యనుతి మధ్యమవైకరీ చతుర్విధశబ్దములను దాటి మహాంబని షుషుమ్నను నెక్కి తన స్తానమందు నైఖ్యమవును గనుక అహంబ్రహ్మాస్మి యనుట అహమనగా నేననేమాట నేననగా పరబ్రహ్మస్వరూపమనియును నిదే నీశ్వరుడనియును విశ్వమంతయు భరించినందున నీశ్వరనామమనియును మంగళప్రదమైన తెలివినిచ్చుటచేత శివుడనియును నా తెలివి నేత్రమధ్యమందు నున్నదనియును. స్మృతి "విశ్వంచక్షురుతంతస్మిన్ స్సర్వం ప్రతిష్టితం" అని ప్రమాణమున్నది గనుక దననేత్రములయందు గనుపించు సర్వ చరాచరప్రపంచము నీశ్వరుడని గురువుచెప్పిన యద్వైతయ దీక్షను భావించినదే యజుర్వేదార్థము ఈయర్థమభ్యాసమైనందా నేబ్రహ్మమని అహంబ్రహ్మాస్మి అనిపలుకుట.

తత్వమసియను సామవేద మహావాక్యము॥స్మృతి॥తత్వమసి ఇత్యభేద। వాచకం యేజపన్తి। తేశివసాయుజ్య ముక్తిః। భాజాభవంతి॥ అనిప్రమాణము గురుప్రుణను శ్రియాద్వైతము ప్రపంచమందు ద్రవ్యాద్వైతము ఆత్మయందు భావాద్వైతము గలిగినదే యభేద వాచకము ఇదేయెల్లప్పుడును ధ్యాసగలిగి యుండవలయును తత్ అనగా నిరాకారస్వరూపము త్వం. అనగా హంసస్వరూపము అసి. అనగా నిరాకారమందు దిరుగగలియడము. ఈప్రకారముగా సమస్తజగత్తునైక్యమవుచున్నట్టు తెలసి భ్రమవిడుచు టీజీవేశ్వరులకు నైక్యాన సంధానము జీవుడనగా ప్రపంచము సత్యమనే భ్రమ ఈశ్వరుడనగా నీసర్వప్రపంచమున నాత్మయని యేకత్వసిద్ధిగలిగినదే ఈశ్వరత్వముకాబట్టి సర్వప్రపంచమును నిరాకారమె నేనన్నజ్ఞానముకలిగి తెనభేదజ్ఞానమనియు

భేదమెయ్యజ్ఞానమనియు సమస్త శాస్త్రములయందును చెప్పబడును. కా
బట్టి జీవేశ్వరులకు నైక్యమయ్యే పరిణమించును.
అయమాత్మబ్రహ్మ అనునధర్వణ వేదవాక్యము. అయంఅనుశబ్దమునకొక
పిండమందె తాత్పర్యముగనుక నండపిండబ్రహ్మాండములకు భేదములేక
యభేదనిష్కర్షగానీవాక్యముపలుకును. అండమనగా గ్రుడ్డు పిండమన
గా సమస్తదేహములయందు గారణమైనహంసస్వరూపము, బ్రహ్మాం
డమనగా పదునాలుగుభువనములు తనకుక్షియందు నిఱుడ్చుకొనితాను
విలక్షణమై సర్వసాక్షియైయున్న పరమాత్మ కిటికి నేకత్వసిద్ధి యేలాగ
నిన బ్రహ్మాండమువలన పిండాండంపిండాండమువలన నండాండం అండాం
డమువలనబ్రహ్మాండము బ్రహ్మాండమువలన ననంతకోటి బ్రహ్మాండము
లు అనంతకోటిబ్రహ్మాండములవలన నండాండము అండాండమువలన
సమస్తజగదుద్భవము సమస్తజగత్తు నండములోను నండము పిండము
లోను పిండము బ్రహ్మాండములోను నైక్యమగుచున్నది. యీనాలుగు
మహావాక్యములకు తేలినఫలం హంసోహం హం నేను సో నీవు నీవే
నేనైతిని నేనె నీవైతివి యీదేహేంద్రియాదులు నేనుగాను జాగ్రత స్వ
ప్న షుషుప్తి తుర్యాతీతములైన యీపంచావస్తలు నేనుగాను, నాకు
లేవు నేను యీచప్పబడ్డ ఒక్కటిగాక నేటివరకు వెనకాముందర భ్ర
మనశించి స్వయంబ్రహ్మమని హంసస్వరూపుండనైతిని అహంకార
ము లేకపోయెను యిక్కడికిమహావాక్యముల తీర్పునహముగిసెను.

ప్ర॥ స్వామీ! దయతో నచలపరిపూర్ణబోధ నెటులనో ఆన తీయ
గోరుచున్నాము.

ఉ॥ శిష్యులారా! మీరు అవాగ్ మానసగోచరమైనప్రశ్న జేసితిరి దెల్పె
దను శ్రద్ధాసక్తులై వినుడి పరిపూర్ణబోధ సూచనయనగా మా
గురుస్వాములవారి వల్లనున్న యింకాముముక్షులవలనయున్న నేవిన్న
కొలది యీరత్నములను కందపద్యములద్వారా దెల్పెదనువినుడి

కందపద్యములు

క॥ శ్రీగురుపదపద్మంబులు। వేగమె మదిలోనదలచి వినుతులు జేయగ
యోగమనంబులు లేనిది। కాగలదిక పలుకులేల కనుగొనుబిడ్డా! 1

క॥ శేషంబని తెలియఁగ నీ । వేషము సూన్యంబటంచు వినఁజెప్పిరిగా
శేషయంబని తెలియఁగ నే । వేషముకొఱగాదు గురునివినుమావత్సా॥
క॥ శ్రీశేషగురుని పదమున । భాసంబని తమము లేదు పలుకుట కైనన్
వాసనయని విడనాడిన । ఆసమయము నీవు నేను నగుపడమోయీ॥3
క॥ శేషగురు పదము దెలియఁగ । భాషాపతి శేషనా కపతులకు తరమా
భాషలు యేమియు జెల్లవు । దాసాజ్ఞ్యగ గురుడు దెల్పుతత్వము కుర్రా॥4
క॥ శేషము శేషంబనుచును । యీషత్తును యన్యమతము నెరుగని వారే
వాసన యేమి యరుఁగని । శేషం బ్రాహ్మంబు నొంద శక్తులు తండ్రీ॥5
క॥ శేషంబను పదమనగా । నీసద్బ్రంహంబునందు నెన్నడు లేదు
యాసాజ్ఞ దెలియుట కై । శేషంబను పలుకు గలిగె సేవించుట కై॥6
క॥ శేషంబని తెలిసిన పై । శేషంబను నామమపుడు జేరు నెచటకో
వాసంధి మిగుల దెలసిన । యాసాధుల చెంత జేరు యన్యం బేల॥ 7
క॥ యేసంధి లేదు వింటె । నీసంశయ మెల్ల వదలు నిజముగ వినుమా
నీసాజ్ఞ్య మేమి లేదిక । మోసము నొందేవు శంక మొగిసిన వత్సా॥ 8
క॥ నేనే నేనని పలికెడి । దానికి మూలంబు దెలసి దానుడిగినచో
నేనన నీవన లేదిక । కానక పైమాట లేమి గనుము కుమార॥ 9
క॥ అనరానిది వినరానిది । కనరానిది యనెడు దాని కన్నది యెవరో
ననిజూడగ మునుదోచను । కనుగొనిమీ యార్యవాక్యపద్ధతి నీవున్॥10
క॥ ముచ్చట లెందున గలిగెనో । యిచ్చట తెలిదం ప్రులెవరో మూల మెరుగుమీ
ముచ్చట లెచ్చట లయమగు । నచ్చోట నె పలుక రానియచల బ్రహ్మం॥11
క॥ నీవనగను నేననగను । భావము వేరేమియందు పదపడి తానై
భావింప కలసిదీరిన । నావల ద్వయదోష మొందునగుపడునోయి॥12
క॥ నీమూలము దెలసిన పై । నామూలంబిపుడె తేలు నానీ రెండున్
ఆమూలంబుగ సమసిన । నా మాటలు తలపు లేల యనదగు తనయా॥13
క॥ తలపుడిగిన తానుడుగును । విలయంబగు తనదు వెంట వేగమె తలపున్
తలపించి తాముడింగిన । పలుకంగా రాదు యవల భావము కొడుకా॥14
క॥ కలదన్నను లేదన్నను । కలదెప్పుడు కలిగియుండు కలుగనిదెపుడున్
కలదన్నను లేదన్నను । కలిగుండదు దీనిసంధి గనుమబ్బాయా॥15

క॥ వున్నప్పుడు నీవునేనను।యన్నగబడుచుండు నెరుగనదితథ్యమగుఁ
నున్నదిలేనిది లేదని। కన్నప్పుడు లేము ఆవలగలదదియేదో॥ 16

క॥ మొట్టమొదలైన లేదు।నట్టనడుమైన లేదు కొట్టకొసన లేదెట్లందుఁ
పుట్టినిదనిబట్టబయులు। చూచ నెరుగనిట్టిదె కొడుకా॥ 17

క॥ బయులందేయాకాశము। బయలెట్లుల బ్రహ్మమగునఁబయలనిపలుకఁ
అయరేవిషయాంబనుచన్ త్రయములపై తూర్యమనుచుతలచుముబిడ్డా।

క॥యుక్తిగసూచన చేసిన।నుత్తమనుత్తమమగుగురునిసాజ్ఞ్యనూహించినపై
బొత్తిగమానుమునూహను। అత్తరిసికపలుకువినుమునదియేమన్నా॥

క॥ అదినీవై తివటందురు। పదపడినేనై తినందు పలుకుదురుబుధుల్
మదిదెలియరు సూచనవిది। తుదనీవును నేను రెండుఁతోఁచదుబిడ్డా॥ 20

క॥ ఉన్నదిసూచనదెలియఁగ। కన్నదిసింహంబుగజను కరణికయేమో
యున్నదిలేదనియనవే।యున్నదినాముందు పలుకుమొనరగకొడుకా॥

క॥ ఉన్నదియనిబలుకఁగనే। నున్నదిమునుమున్నెలోచు చుండునుగాదా
యెన్నినయుక్తియొసరియని। వున్నదివిశ్వబ్రమనుచు నుండుముబిడ్డా॥22

క॥ అద్వయమనిపలుకకురా। వద్దనెద్వయమున్న విధము వాడుకగాదా
నిద్దంపుబోధయిదియే।అద్వయమునద్వయముగాదామనుమాతండ్రి

క॥ అదియఁనుసఖండమనుచును। వదరెదవిచొల్లుమాత వలదిచ్చోటఁ
మొదలనుఖండంబేదది।యిదిచెల్పుచునోరుమూసికొనుమాకొడుకా।

క॥ నిర్గుణమనిపలుకకురా। యెగ్గేమికసగుణమనుచు నెన్నగబడుగా
నిర్గుణమనిసగుణంబని।బుగ్గలుకదిలించవలదు బుధుతావినరా॥ 25

క॥ మోక్షంబిదికలదనగా। నాక్షణమేబంధమనుచు నగుపడుచుండుఁ
వీక్షింపుమునీభావము। నాక్షేపణలేమిరావు అయ్యావినరా॥ 26

క॥ ఉన్నదనంగను లేదది। యెన్నిక లేదనుచు బలుకనున్నదియేదో
అన్నప్పుడు విన్నప్పుడు। తన్నేతాదెలసిపోతె తథ్యముతనయా॥ 27

క॥ పోదదికాదదియనుచును। వాదంబులు మాని గురుని వాక్యంవినరా
లేదదియేమనియనుటకు।యెందెందునగలదోయికను వెతకరంబుడతా

క॥ పలికినపలుకున లేదది। తెలసిన తెలివంను లేదు తెల్లముగాదా
కలుగదుచూచెడిచూపున।తలపగగురుసూత్రిమంమతగునుగదన్నా॥

క॥ సూక్ష్మములో మోక్షంబని । సాక్షాత్తుగ దెలసెనేని సర్వము తానా
యీక్షణమేమియనేకపరీక్షలు । కోరగావునిందుయిదియగుపుత్రా॥

క॥ కంటికికనుగొనరానిది । అంటుదమనియన్న చేతికందనిదదిగా
దంటామననోరునురా । దంటాయిదియెటువినంగ నద్భుతమప్పా॥ 31

క॥ కందామనిపోగాతా । నెందోపరుగెత్తిపోవునిక మరలదుగా
అందేమిచోద్యమునకో । యిందునపలుకుదమటన్నను యిమడదు బాబు

క॥ అన్నా యిది మార్గంబని । తిన్నగచూపించియొకడు తిరుగక పోమో
మెన్నాళ్లు తిరిగినావా । యన్నయి తెకానరాదు యడిగిన జెప్పుమా॥

క॥ ముందేమో యనుకుంటిని । యందునన్నోడరాక యిగిలించితివా
యందంబేమో తెలియను । యెందుకికపోరటాచును వెళ్ళగదన్నా॥34

క॥ అన్నప్పుడు తానున్నది । విన్నప్పుడు తానునుండె కన్నప్పుడున్
యెన్నినసరి తానప్పుడె తిన్నగమటుమాయమా యె తెలియు మోయప్పా

క॥ పిలువగబోయినవాడును । పిలువంగాబడినవాడు పిలుమన్న వారుమువ్వుర్
గలసిపోయిరి తొలిరూపమున । మలిమళ్ళపట్లు తోచది దేమో వత్సా॥36

క॥ అందునవిందునయేమని । అందామనవిష్టురంబు యెందుకు యిక యీ
సందేహమనుచు సాక్షులు తొందరప్రభుస్త్ర ళముపిడచి తొలగిరియటకో

క॥ యిట్టిదిసూత్రింబనుచును । గట్టిగగురుసూచనెరిగి కదలనివాడే
యట్టనపానిపదంబున । నట్టిట్టను చలనమెరిగివుండియు నుండున్ ॥38

క॥ అద్దంబునిలిపిచూచిన । పద్దునుసున్నాలుగలిగి బలమైయుండున్
అద్దంబుపగిలితే పై । యిద్దరిరూపంబుసూన్యమెనుగుముబిడ్డా॥ 39

క॥ కారణముండినకార్యము । వేరే తానుండుననుచు వెతుకగవలెనా
కారణముడిగినకార్యము । వేరేలా లేదటంచు వినుమోతనయా॥40

క॥ మన్నుంపగ గుంధకములు । యెన్నగబడె వేరువేర వీక్షింపంగా
మన్నే లేకుండిన నేమున్నది! కుంభంబులనగ నూహింపుమయా॥ 41

క॥ బంగారుకడగసొమ్ములు । శృంగారముగాగదోచు చుండుటనిజమా
బంగారుసూన్యమగునిక । శృంగారములెందుగలవో చూచిపలుకరో । 42

క॥ యెన్నడు లేకున్నది । నేనన్నది నీవన్నది తరమన్నదియంతయే
మన్నయుదీరనుయిదిలే । కున్నప్పుడు యిందాశంకయుండిన చెప్పుమా॥

క॥ తెలియునది యెంత కాలము । కలిగున్నదియంతవరకు కలగాదో చున్
చలమగు దృశ్యజాలము । తెలివేతను సూన్యమైతె తీరును సర్వం॥44

క॥ ఉన్నదివున్నట్లే సరి ! విన్నదియు అన్నదియు కన్న వివరణమేమో
సన్నగ సన్నగ తానే । యెన్నుచు తనుదీరిపోతె యేమనరాదు॥ 45

క॥ నిజము సూచనగ ననీ । రుజువులు కోరగావు యెన్ని రూఢిగ వినరా
గజిబిజి వీడుటకై । తజిబీతులు పలుకవలసె తాత్పర్యమునన్ 46

క॥ యిందుకు సంశయముండిన । నందుకు జనకుండు దెల్పెనలసుకమునికిన్
ముందుకు నేజచ్చినరా। విందేటికి పొమ్మటంచు విఘువు మునీవున్॥ 47

క॥ యిదిపదిలము జేసుకనీ । వదురుదు సాలించి యికను వదలుము దానన్
నిదిరుక్మిణికి నిక్కృష్ణుడు । విదితంబుగ దెల్పె హూనిదియుని చనియన్ 48

క॥ యింతే చాలును వినుమా। మంతనముసగురుని సాక్ష్యమానము నొంది
యింతకు లేదని తెలియుము । సంతసమున శిష్యుడుగారికిట్లనెతనయ॥49

క॥ నీళ్ళనుదోచిన సూర్యుడు । దోర్లుమపాతాళమునకు వెళ్ళుటగలదా
పాళ్ళక్కి నీవు కలిగిన ॥ అల్లప్పుడు కానుపించు టది సహజముగా॥50

క॥ నిజగురుడే కావలెరా । నిజముగ గల మార్గమెల్ల రూఢిగ దెల్పున్
గజబిజి పడనీయడుగా। భజియించిన వారిపదమే భజియించవలెన్॥51

క॥ తాననునది కడతేర్పని । జ్ఞానులు గురులనగరాదు జాగ్రత వినుమీ
జ్ఞానాజ్ఞానా విరహితులు । తానే సేవించెనేని తానే గునుగా॥ 52

క॥ మొద్దని దొంగని భయముపడి । వద్దవి అటుబార వేసి వచ్చినరీతిన్
కొద్దిగ సూన్యభ్రమ గురు। సుద్దులు విడనాడినట్టి సుడిబడకుసుమీ॥53

క॥ అందున నేదిం ముదలే । దెందున లేదెవలలేదు యెన్నడు లేదా
ముందును వెనుకను లేదను। సంధిన వినుపించె వారి సరిలేదన్నా॥ 54

క॥ ఉన్నది లేదనినే। కన్నామని ధర్మమనుడు గాడిదకూతల్
దున్నల వలెకూసెదువా । చెన్నడు నిజపాట లేదు వెయ్యర భేరీ॥ 55

ఉ॥ తనయులారా! మీరానందముగా వినుడి ఒక్క మాట దెల్పెదను జ్ఞానాగ్ని యనునది మేఘములయందురుములవలెను శంఖనాదము వలెను భేరి మొదలగు వాద్య ఘోషములవలెను పకపకన వ్వేదునవ్వువలెను కదుపునొప్పివలెను వ్యసనము వలెను ఒకానొకప్పుడు కలుగుచున్నదిగా బట్టియె

రుకయునటుల గనుపించికనుపించకపోవుటచేత నేకుండేటికొమ్ములవలెను
గొడ్రాలిబిడ్డలవలెను ఆకాశపుష్పమువలెనునరుని కొమ్ములవలెనునిష్ప్ర
యోజనమగుటచేత నీనిల్కడలేని జ్ఞానముచేతనే దబ్బరమైనభ్రమగను
కజ్ఞానమును నిల్కడలేనిదబ్బరగానేయున్నది పంచశరీరములను దెలుసు
కొనునదియే క్షేత్రాధిపతి అదేజ్ఞానమని ప్రసిద్ధముదానికేప్రత్యగాత్మ
యనియును ప్రకృతిపురుషులనియును కూటస్థుడనియును బ్రహ్మమనియు
ను క్షేత్రజ్ఞుడనియును సచ్చిదానందమనియును పరమాత్మయనియును ప
రమేశ్వరుడనియును సర్వమునుసాక్షిస్వరూపుడై చూచువాడనియును
వేదవేద్యుడనియును జ్ఞానమనియును శ్రీమన్నారాయణుడనియును ప
రమశివుడనియును ఇట్టికారణములచేతనే జ్ఞానస్వరూపంబనిచెప్పంబడు
చున్నది గనుకజ్ఞానమే జీవోపాధియని చెప్పంబడుచున్నది గనుకజ్ఞానమే
యెరుకయనిన్ని జ్ఞానమే వేదశాస్త్రములనిన్ని జ్ఞానమే సత్తుచిత్తుఆనందమ
నిన్ని సచ్చిదానందస్వరూపమనిన్ని చెప్పబడుచున్నది గనుకసచ్చిదానందర
హితమేపరిపూర్ణమని తెల్సుకోవలయునుయింతకుమిక్కిలి లేదుఇదేసత్యం

శావల్యాపురం } ఇట్లుబుధజనవిధేయుడు,
వినుకొండతాలూకా } జవ్వాదుల లింగా యోగి

అయ్యగారు చెప్ప ఈగ్రంధము వ్రాసినది.

ఇట్లు దాసానదాసులకు దాసుడు

లింగాయోగిగారిశిష్యుడు యర్రింశెట్టిలక్ష్మన్న కొమార్డు పుల్లాదాసుడ
ప్రూడుచర్లగ్రామము అగ్నిగుండాలశివారు వినుకొండతాలూకా

గుంటూరుజల్లా

గద్య. ఇదిశ్రీమద్వేదవేదాంత శాంతశమద మధ్యాంతనంతకళ్యాణపూర్ణు
లును సచ్చిదానంద రహితుండును ప్రకృతిద్వయదోష నిరతునును
నాదుబిందుకళాతీతుడును ఉదాధిద్వయదోషరహితుండును అశరీరుం
డును అచలపరిపూర్ణుండునునగు జవ్వాదుల లింగాయోగి
గారిచే రచియింపబడిన శ్రీరాజయోగాంతరప్రబోధిని
సమాప్తము.

శిరస్తు.

తెనాలితాలూకా చేబ్రోలుపోష్టువిలాకా
కొత్తరెడ్డిపాలెం కాపురస్తులు.

దుగ్గిరాల వెల్లరెడ్డిగారు
కటకంశెట్టి నాసరయ్యగారు
పిడతల కొండయ్య
ఉడుముల లింగమాంబ
కుప్పము కోటమాంబ
వీరిదైవసాయమువలన ఈగ్రంథము అచ్చుకూర్చ బడినది.

తెనాలితాలూకా చేబ్రోలుపోష్టువిలాకాకొత్తరెడ్డిపాలెం గ్రామకాపురస్తులు
దుగ్గిరాల యల్లారెడ్డి
వుడుముల లింగమాంబ
కటకంశెట్టి నాసరయ్య
పిడతల కొండయ్య
కుప్పంగుర్వయ్య భార్య కోటమ్మ
యీశిష్యబృందమువారి ద్రవ్యసహాయమువల్లను
అచ్చుకూర్పబడినది

ధర్మవరము
కోట లక్ష్మిందేవమ్మ
కోట అచ్చమ్మ
కడెం వెంకమ్మ
లక్కాకుల వెంకమ్మ
రాళ్ళపల్లె వెంకయ్య
పోన్నెగుంట రంగయ్య

మట్లూరు గ్రామం
చీరాలసుబ్బమ్మ కుమార్తె తిరుపతమ్మ
తిరుమలశెట్టి అచ్చమ్మ
ఉక్కులపు అంకమ్మభార్య అంకాళమ్మ

గుంటూరులో
కోట ఆదెమ్మ

కొనగానివారిపాలెం
దాసరి పకీరమ్మ
సాకలి వెంకటదాను భార్య గుర్వి

తెనాలి తాలూకాలో
అంబటి బసవయ్య కుమారుడు శేషయ్య
కొసనా కోటయ్య
వేమిశెట్టి రామస్వామి భార్య మాచమ్మ
అంబటి చిన్నమ్మ
అంబటి సుబ్బయ్య
అంబటి సౌభాగ్యంమ్మ
అంబటి కొండయ్య
అంబటి సుబ్బమ్మ
అంబటి వెంకటప్పయ్య
దేవిశెట్టి కుటుంబయ్య
దేవిశెట్టి లక్ష్మీనారాయణ
బెసబత్తిన నాంచారమ్మ
బోయసాటి సుబ్బమ్మ
దుగ్గిరాల యల్లారెడ్డిగారు
దుగ్గిరాల నారాయణమ్మ
వజ్రాల సుబ్బమ్మ
దుగ్గిరాల మంగమ్మ
శేఖు జానిబూబు
అన్నంవీరాస్వామికొమార్తె మార్తెమ్మ
పసుపులేటి రామస్వామి
పసుపులేటి కాంతమ్మ
వుడుముల లింగమాంబ
అన్నం యేడుకొండలు భార్య సుబ్బమ్మ
అన్నం వెంకటస్వామి
యీ ఆదెమ్మ

నరసారావుపేట తాలూకా నాదెండ్ల
శిష్యవర్గము
చేకూరు రామానుజయ్య

తూబాటి అలివేలమ్మ
నలబోతు వెంకటాద్రియ్య భార్య రత్తమ్మ

బుక్కాపురం

చెన్నంశెట్టి శీతారామయ్య
పీలా కోటయ్య
బొడ్డుపల్లి రామయ్య
బొడ్డుపల్లి యీరమ్మ
జంగం అంజమ్మ
మోకల సుబ్బయ్యభార్య నారాయణ

రాయపాడు

అముదాల వెంకటస్వామి
సింధశెట్టి రాఘవమ్మ
ఆకుల పున్నమ్మ
దొడ్డా వెంకన్న భార్య గురమ్మ
దొడ్డా నాగూరమ్మ
గంధం కోటయ్య
చాకల కొండాయ
చాకల నర్సాము
రాయపూడి కోటదాసు

యినుకొండతాలూకా అద్దెపోలు

కొమరిశెట్టి ఓబయ్య కుమారుడు పెదగురుమూర్తి
భా॥ యీశ్వరమ్మ
యీ వేయ్య భార్య గోవిందమ్మ
చినగురుమూర్తి భార్య యీశ్వరమ్మ
గడ్డం లక్ష్మిదేవమ్మ
గొట్టిపల్లి కోటయ్య కుమార్తె యల్లసుందరగోవిందమ్మ

రేపల్లెతాలూకా కొణగానివారిపాలెం

దాసరి సుబ్బయ్య భార్య రంగమ్మ
కటకంశెట్టి లింగమ్మ
కొండపల్లి నాగయ్య భార్య వెంకమ్మ

ముట్లూరు

చాకల దూపాటి కొండాదాముని భార్య నాగామ
గుర్రపసాల నాగిడు భార్య కొండామ
దూపాటివరసదాసుని భార్య కోమార్తెసుబ్బి

పొన్నూరు

దాసరి మాణిక్యం
యీ చెంచమ్మ
యీ నారాయణస్వామి
యీ సుబ్బయ్యభార్య రత్తమ్మ
యీరి అప్ప హనుమాయమ్మ

పొన్నూరు

కొప్పాకు వీరయ్య
యీ బుచ్చయ్య
సాతె పిచ్చయ్య
కొప్పాకు చిన్నమ్మ
హనుమతి అంకమ్మ భార్య సుబ్బమ్మ

నిడుబ్రోలు

దాసరి సుబ్బయ్య భార్య సుబ్బమ్మ
దాసరి చినసుబ్బయ్య భార్య రాయమ్మ
దాసరి పిచ్చమ్మ
యనుముల యంకాయమ్మ
యనుముల చిన్న యంకాయమ్మ

బాపట్లతాలూకా

గుంపళ్ళ సుబ్బయ్య భార్య రంగమ్మ
కోడుమూరు రాఘవయ్య

బాపట్ల

పులికట్ల నాగమ్మ
గుర్రి నరసింహం భార్య హనుమాయమ్మ
చింతల మంగయ్య
ఆకుల లక్ష్మమ్మ
పూటనూరి సుబ్బయ్య

శ్యామలాపురం

జవ్వాదుల లింగయోగిగారు శిష్యుడు
కటుచెట్టినాసరయ్యగారి శిష్యులు

సత్తెనపల్లితాలూకా తక్కెళ్ళపాడు

కనిగిరి వీరమ్మ
నీలం చెంచమ్మ
సంకుర కోటమ్మ
సంకుర రామకోటి
కూరాకుల చిన్నరామయ్య
సలాదుల సుబ్బమ్మ
చేతనశెట్టి వీరయ్య
గోపిశెట్టి మాలక్ష్మి

కోమ రేపూడి

కొల్లి అప్పయ్య భార్య సుబ్బమ్మ
కొల్లి అన్నమ్మ
గుఱ్ఱం కోటమ్మ
తిరువెళ్ళ గోవిందమ్మ
నలబోతు కోటమ్మ
నలబోతు జానికిరామమ్మ
యామా నరిసింహం భార్య మాలక్ష్మి
యామా అచ్చమ్మ
యామా ఓబయ్య భార్య నారాయణమ్మ
యాఱ్ఱం రంగయ్య

బెలుసుపాడు

చింతల వెంకమ్మ
కూరాకుల సుబ్బమ్మ
కూరాకుల కోటమ్మ
కటుకం లక్ష్మమ్మ
కటుకం వెంకయ్య
యిక్కుర్తి యల్లమంద
కూరాకుల పెదకోటమ్మ
వుప్పలపాటి బసవమ్మగారు
సామంతపూడి పిచ్చమ్మ

గుంటూరు కొరిటెపాడు

మాదాసు నరసయ్య భార్య వీరమ్మ
తోట లక్ష్మిందేవి
రేపూడి నాగమ్మ
శ్రీకృష్ణ రామమ్మ

గోరంట

గోరంట కోటనాయుడు భార్య అచ్చమ్మ
గోరంట వీరయ్య
గోరంట నన్నయ్య
గోరంట వేరయ్య
చిక్కాల లక్ష్మిందేవమ్మ
తియ్యగూర కోటిరెడ్డి భార్య సీతమ్మ
తిరుబడ్డి బోడెయ్య
సాకలి కోటప్ప

గురిజాలతాలూకా కొత్తల్లిప గ్రామ

కాసాగరం సాంబమ్మ
వేకల చెంచమ్మ

ధర్మవరం

అడపాల నరసమ్మ
కోట లక్ష్మిందేవమ్మ